# KAVITHA KUSUMA MANJARI.

COMPILERS:-

*Vidwan, S. V. Dikshitulu M. A;*
( Proficient in Oriental Learning )
Assistant, Wesley Boys' High school,
Secunderabad (Dn.)

&

*Vidwan, P. Krishnamurthy,*
Assistant, Wesley Girls' school,
Secunderabad, (Dn.)

Printed at Sree Bharathi Printing Press,
SECUNDERABAD.

 1939. (Price 0-8-0.

# INTRODUCTION.

This compilation is intended for the use of High School students. In this an endeavour has been made to supply the long-felt want of a suitable text-book, including some of the best pieces of Poetry, lyrical, narrative, didactic and descriptive. A careful selection has been made both from ancient and modern authors. We hope the book will merit the attention of Educational Authorities.

Our thanks are due to those modern authors who have kindly permitted us to incorporate their esteemed verses in this book.

SECUNDERABAD. } S. V. Dikshitulu.
31-10-1939. } P. Krishnamurthy.

# విషయసూచిక.

ఓమ్.

# కవితాకుసుమమంజరి.

## గీతాంజలి.

[illegible] దర్భా వేంకట కృష్ణమూర్తి.

[బ్రహ్మశ్రీ విద్వాన్ దర్భా వేంకట కృష్ణమూర్తి ఎం. ఏ. గారు మదనపల్లి కలాశాలలో ఆంధ్రోపన్యాసకులుగను, దేశభాషాపర్యవేక్షకులుగను ఉన్నారు. వీరు కేవల మాంగ్లభాషాభిజ్ఞులు మాత్రమే కారు. సంస్కృతాంధ్రభాషా ప్రావీణ్యముగూడ వీరికిం గలదు. వీరు "శ్రీశుకనాసోపదేశము-శ్రీగురుదక్షిణ" యను రెండుభాగములుగల గ్రంథము మున్నగువానిని రచించిరి. వీరికవిత్వము ప్రీతికరమై సుబోధమై నిర్దుష్టమై హృదయంగమముగా నుండును. పాఠ్యభాగము శ్రీరవీంద్రమహాకవి రచితమగు "గీతాంజలి" గ్రంథమందలి ఆంగ్లపద్యముల కాంధ్రానువాదము.]

సీ. ఎందే భయంబన్న దెఱుఁగదు మానస
మెందే మహోన్నతి నెసఁగుబుద్ధి
ఎందేని యణుమాత్రమేని కళంకంబు
గానరాదల్ల సుజ్ఞానమునకు
ఎందేని సంఘ నిబంధనంబులఁ బటా
పంచలుగాదీ ప్రపంచమెప్పుడు
ఎందేని హెచ్చుమేలేని లోనుండి
వెలువడుసత్య వాగ్వితతిసతము
ఎందేని పూర్ణత నెనయు నశ్రాంతంబు
నశ్రాంత భవ్యపరిశ్రమంబు
ఎందే వివేకవాహిని విమూఢాచార
భయద మరుస్థలిన్ వట్టిపోదు
ఎందేని మానస మేపారు నున్నత
భావచేష్టలఁ ద్వత్కృపారసమున

తే. గీ. అట్టి స్వాతంత్ర్య నాక సౌఖ్యంబుఁబడసి
ఖండ ఖండాంతరములఁ బ్రఖ్యాతికెక్కి

జయము గాంచంగనిమ్ము మాజన్మభూమి
దళితభవపాశ! ఈశ! భక్తప్రకాశ.

సీ॥ నాసల్పు రవమెల్ల నీసుస్వరస్ఫూర్తి
నసయము నెయ్యమ్ము నెనయనిమ్ము
నాచేయు పరియోచనయు భవత్సాన్నిధ్య
బోధన్ బ్రపూర్ణతన్ బొరయనిమ్ము
నానెమ్మదిం దోఁచు నవ్యభావంబెల్ల
నీకటాక్షమున రాణింపనిమ్ము
నాయుల్లమునఁగల్గు నేయిచ్ఛ యాయిచ్ఛ
నీదివ్య సత్త్వాన నెగడనిమ్ము

తే. గీ. ఉన్నతాశయుఁ బలుకును యోచనయును
సర్వమున్ నీకతాన నెసంగనిమ్ము
నీదుకల్పనమేరకు నాదుబ్రతుకుఁ
దీర్చిదిద్దవె! యోజగద్దివ్యశిల్పి.

తే. గీ. జీవులకుమూల శక్తివౌ దేవదేవ
తావకాంశంబు సర్వత్ర యావరించి
మామకశరీరమందుంట మ్యాన కెపుడు
బావనంబుగ దీనిఁ గాపాడుచుందు.

తే. గీ. జ్ఞానదీపంబు మన్మానసాన వెలుఁగ
జేయు పరతత్త్వ మీవౌటఁ జిత్స్వరూప
నాతలంపులఁ జొరనీక నారతంబు
నావలికి నెట్టుచుందు మాయావితతిని.

ఆ. వె. సూత్రధారుఁడీవు, పాత్రము నేనోదుఁ
గర్తవీవు, త్వదుపకరణమేను,
గాన నాదు నడతలోనఁ బరాత్పరా
చాటుపడిన నిన్నుఁ జాటుచుందు.



# మహాప్రయత్నము. నన్నయభట్టు.

[నన్నయభట్టు. ఇతడు కృష్ణాగోదావరీ నదుల మధ్యనున్న వేగిదేశమును క్రీ. శ 1022 నుండి 1063 వఱకుఁ బాలించిన రాజరాజు నాస్థానకవి. ఇతఁడు సంస్కృతమున వేదవ్యాసునిచే రచింపఁబడిన భారతము నిష్టానుసారముగ తెలుఁగు చేసెను. ఇతఁడు మొదటి రెండుపర్వములను, మూడవ పర్వమును గొంతవఱకును వ్రాసెను. భరతవంశీయుల చరిత్ర మగుటచే నాగ్రంథమునకు భారతమని పేరు. వేదోక్తములగు ధర్మసారమంతయు దీని యందుండుటచే దీనికిఁ బంచమవేదమను నామాంతరము గలదు. భారతమంతయుఁ బదునెనిమిది భాగములుగ విభజింపఁబడినది. పర్వమున గనుపని యర్థము. భారతమొక చెఱకు గడతోఁ బోల్పఁబడుటచేఁ బ్రతి భాగమును బర్వమనుటయే తగియున్నది.

ప్రకృత పాఠ్యభాగమారణ్యపర్వములోనిది. రోమశ మహాముని అరణ్యవాసము చేయుచున్న పాండవులపాలికిఁబోయి, అగస్త్యుని చరిత్రము చెప్పి పిదప సగరుల చరిత్రమును భగీరథుని ప్రయత్నమును దెలియఁజెప్పెను. ఈభాగమునందు నన్నయ కథావేగమును, ఆతని సంస్కృతపద భూయిష్ఠమగు శైలియు గమనింపఁదగును.]

క. సగరసుతులట్లు జగముల
కోగి బాధలుసేయుచున్న నోడిమరుత్ప
న్నగ వరులరిగిరి నాలుగు
మొగములు గలవేల్పుకడకు మునిసంఘముతోన్. 1

ఆ. వె. వారిజాసనుండు వారలువచ్చిన
విధమెఱిఁగివారి వెఱవ నేల
సగరసుతులు దగ్ధులగుదురు దర్పితు
లైనవారిపేర్మి యధ్రువంబు. 2

వ. అని కమలభవుండాన తిచ్చిన నరిగి యమరనరులాదిగా నఖిల లోకనివాసులెల్ల సగరసుతపరిక్షయఁ బపేక్షించి యుండునంత. 3

సీ. అశ్వమేధంబు సేయఁగ దీక్షితుఁడయ్యె
సగరుండు వానియశ్వంబు సగర
తనయులచే రక్షితంబై వసుంధర
యెల్లఁగ్రుమ్మరి తోయ హీనమైన

జలధిలోపల నదృశ్యంబైనఁగానక
సగరున కెఱిఁగించి సగరసుతులు
జనకు శాసనమునఁ జని భూతలమునందుఁ
దడయక త్రోసి పాతాళతలము

ఆ. నందు రోయఁగడఁగి యఱువదివేవురు
నొక్క మొగిన గ్రొచ్చి రుదధిలోన
జలధిపంకమగ్న సత్త్వముల్ నిశితకు
ద్దాలహతి విదారితములుగాఁగ. 4

వ. ఇట్లు గ్రొచ్చి గ్రొచ్చి సగరసుతులు సముద్రపూర్వోత్తర దేశంబునం గపిలుండను మహాముని యాశ్రమమునందుఁ దమాగుజ్ఞంబుఁ గని సంతసిల్లి. 5

ఆ. వె. అశ్వమేధమునకు నర్పితంబైన యా
యశ్వరాజు నిట్టు లపహరించి
ముచ్చుగాఁ జెక యీ సముద్రదేశంబున
నోట మాఁటలేక యున్నవాఁడు. 6

వ. అని కపిలుం బరిభవించిన నమ్మునివరుం డలిగి యనలశిఖలు దూల నతిఘోరదృష్టిం జూచినయప్పుడు సగర సుతులందఱు భస్మంబైన. 7

క. వీరులగు సగరతనయుల
దారుణదాహంబుఁ జూచి తడయక చని యం
భోరుహగర్భతనూజుఁడు
నారదుఁ డంతయును సగరునకు నెఱిఁగించెన్. 8

క. దాని విని సగరుఁ డురుశో
కానలదంద హ్యమానుఁ డయ్యును నయ్యా
శాను వచనంబుఁ దలఁచి ధ
రానాథుఁడు శోకభరపరాఙ్ముఖుండై. 9

వ. అసమంజసపుత్రు నంశుమంతుం డను మనుమనిం జూచి యయ్యా నీ యయ్యలఱువదివేవురు నొక్కటఁ గపిలకోపానలకబళిత శరీరుల

యిరి. భవజ్జనకుఁడతికూరహృదయుండై పౌరబాలకుల నకారణంబ వధియించి మహానదిలో వైచుచున్న నెఱిఁగి పౌరజనాక్రోశంబునందు నక్రోశపరుండనై వాని విడిచితి. 10

క. కొడుకుల నిధనమునకు నా
కడిఁగిన హయమేధ మఖము గడచనమికి నేఁ
గడు దుఃఖితుండ నయ్యెదఁ
దడయక నీవిపుడు దీనిఁదలఁగుముకడఁకన్. 11

వ. అని ననంశుమంతుఁడాక్షణంబ చని సగరసుతఖాతద్వారంబున సముద్రంబు సొచ్చి యందు సూర్యసహస్రద్యుతియై వెలుఁగుచున్న కపిలమహామునికి నమస్కరించి నిజాగమనప్రయోజనంబెఱిఁగించినఁ గపిలుండును వానికిం గరుణించి యజ్ఞియంబైన యశ్వంబునిచ్చి యిట్లనియె. 12

క. ఘనభుజ నీకారణమున
జనఁగాంతురు పుణ్యగతికి సాగరులు ముదం
బున సగరునకును దొరకును
నొనరఁగ సుతవంతులైన యుత్తమగతుల్. 13

వ. మఱియు నీచేత నుపనీతంబైన యీయశ్వంబున నశ్వమేధంబు సేసి సగరుండు కృతార్థుండగు నీపౌత్రుండైన భగీరథుచేతఁ దేరంబడియెడుగంగాజలౌఘంబులం జేసి సంసిక్తులై సగరసుతులు స్వర్గగతులగుదురు సముద్రంబు సంపూర్ణంబగుననిన నంశుమంతుండు సంతుష్టుండై కపిలప్రసాదంబున నశ్వంబుఁదెచ్చి సగరునకిచ్చి కపిలువచనంబు నెఱిఁగించిన సగరుండు పుత్రశోకంబుడిగి యశ్వమేధంబుసేసి సముద్రందనకుఁ బుత్రుఁగాఁగల్పించిన నదిమొదలు సముద్రంబు సాగరంబునాఁబరఁగె నిట్లు సగరుండు పెద్దకాలంబు రాజ్యంబు సేసి నిజరాజ్యభారం బంశుమంతునందు సమర్పించి చనిన. 14

తే. తనపితామహు నట్టుల ధరణియేలి
యంశుమంతుండు నిజపుత్త్రుఁడగు దిలీపు
నందు రాజ్యభారముఁబూన్చి యఖిలలోక
పూజితుండు తపోవనంబునకుఁ జనియె. 15

వ. దిలీపుఁడును దనపితామహులైన సాగరులధోగతులుగాకుండ గంగానదీతరణంబునందు యత్నంబుసేసి యశక్తుఁడయ్యె.

చ. ప్రథితయశున్ సుతుంబడసె భారసహిష్ణు మహారథున్ భగీ 16
రథుఁడనుచక్రవర్తి నపరాజితతేజు నిజాన్వవాయదు
ష్పృథవినివర్తకున్ సకలపార్థివజైత్రు మహోద్ధతాసుహృ
న్మథను సురాపగానయనసమర్థతపోగుణయుక్తు నుత్తమున్. 17

వ. ఆభగీరథు నపారభూభారధురంధరుం జేసి దిలీపుండు తపోవనంబున కరిగిన. 18

తే. కపిలు కోపాగ్నిఁ జేసి సాగరులుగ్రాఁగి
రవియు గతిఁ గానకున్నవారనియు నెఱిఁగి
వారలకు హితమొనరింప వగది గంగఁ
దేరఁగడఁగె వీరుండు భగీరథుండు. 19

వ. ఇట్లు భగీరథుండు గంగావతరణంబునందుఁ గృతనిశ్చయుండై హిమవంతంబున కరిగి. 20

చ. సతతకృతోపవాసముల శాకఫలోదకమూలపారణ
వ్రతముల దేవపూజల నపార జపంబులఁ జేసి నిష్ఠతో
నతులతపంబుసేసె నమరాపగ నుర్వికిఁ దెచ్చువేడ్కతో
ధృతియుతుఁడై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్. 21

వ. ఆభగీరథుతపంబునకుమెచ్చి గంగాదేవి ప్రత్యక్షంబై నీయిష్టంబుసెప్పుమనినం గృతాంజలియై యిట్లనియె. 22

సీ. తపనతేజుండైన కపిలు కోపంబున
గతజీవులై పుణ్యగతులయందు
విహతులై మత్పితామహులున్నవారు నీ
దగుపుణ్యజలముల సగరసుతులు
సిక్తులై స్వర్గానుభుక్తిఁ బ్రాపింతురు
గావున దేవి యిద్దేవపథము
నందుండి వసుమతి కొందంగఁ జను దేర
వలయు నావుడు మహీవలయమునకు

ఆ. నేనువచ్చునపుడు నానిరంతరజలౌ
ఘంబు దాల్పనీలకంఠుఁ డోపుఁ
గాని యొరులుదాల్పఁ గానోప రయ్యుమా
నాథుకరుణఁబడయు నన్నుఁదాల్ప. 23

వ. అనిన గంగాదేవి వచనంబునఁ గైలాసంబునకరిగి భగీరథుండు భగవంతు నంతకాంతకు నీశ్వరుగురించి పెద్దకాలంబు తపంబుచేసిన నీశ్వరుండు వానికిసన్నిహితుండయి నీవుభూలోకంబునకు గంగావతరణంబు సేయుమేను గంగధరియించెదననిన భగీరథుండు వెండియు గంగ నారాధించిన నాతనికింగరుణించి. 24

మ. ఇలఁజుణ గంగతరంగసంహతులతో నేతెంచె నాశాంతరం
బులు నాకాశముఁగప్పుచుం దగమహాభూత ప్రపంచంబుతోఁ
జెలువైయుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెణ సంగతోత్తుంగ పిం
గళజూటాగ్రము నందుఁ బద్మదళసంకాశంబుగా లీలతోణ. 25

సీ. సురమునిసిద్ధ ఖేచరవరుల్ వచ్చియ
చ్చెరువందిచూడంగ హరుశిరంబు
నందుండి భువనైక వందిత సురనది
ధరణీతలంబున కరుగుదెంచి
కలహంసగతియు నిర్మలఫేన హాసంబు
నాకీర్ణమీనవిలోకనములు
నాలోలపవనవాచాలిత కల్లోల
రసిత మృదూక్తులు నెసఁగుచుండఁ
గీ. బ్రీతితో భగీరథుఁ డను దూతచేత
నీతయై మహాముని పరి పీత రిక్త
మగు సరిత్పతిఁగూడి యాసగరజులకు
హితముగా దాని నించె నా తతజలముల. 26

క. సాగరులకు సద్గతిగా
సాగరమున కట్లుసలిల సంపూర్ణముగా
భూగతయై భాగీరథి
భాగీరథకీర్తి భువిన పంక్తులనిలిపెణ. 27

## శాపవిమోచనము.

తిక్కన.

[తిక్కన నెల్లూరు మండలము నేలిన మనుమసిద్ధియాస్థానకవి. ఇతఁడు రమారమి క్రీ. శ. 1200-1257 సంవత్సరముల మధ్య నివసించియుండెను. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు ఇతని యింటిపేరు కొట్టరువు వారని తెలియుచున్నది. ఇతఁడు తన నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధి కంకితముచేసెను. పిమ్మట యజ్ఞముచేసి సోమయాజియై నన్నయ తెలిఁగించిన భాగములను విడిచి మిగిలిన పదునైదు పర్వములను హరిహరనాథున కంకితము చేసి రచియించెను.

ప్రకృత పాఠ్యభాగ మశ్వమేధపర్వములోనిది. అర్జునుడు మేధ్యాశ్వమునుగొని మణిపురమునకుఁబోయి తన పుత్త్రుఁడయిన బభ్రువాహనునితోఁ బోరాడును. ఈభాగమునఁ గర్ణ పర్వముగు పలుకుబడులు, అర్థసందర్భముల పొందిక, కల్పనాకౌశలము, మొదలగున పూర్వగుణఁబులు కానఁగును. ఈతని శైలిలో రెండు పాళ్లు తెలుఁగుపదములును, ఒకపాలు సంస్కృత పదములు నుండును.

వ. బభ్రువాహనుండు నిజజనకుం డయినయర్జునురాక యాకర్ణించి. 1

ఆ. వినయ మెసఁగ నార్య జనసమేతంబుగా
నరుగుదెంచి యతని చరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కిరీటి యన్నరపతి
నాదరింప కుండె మేదినీశ. 2

వ. అట్లుండి తనయునాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుం డై యూరకున్న యక్కుమారునితోఁ ధనంజయుం డిట్లనియె. 3

ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా
కీగతిమెత్తఁబాటు దగు నే నృపధర్మవిహీనతన్ రణో
ద్యోగము లేక తక్కి భయ ముల్లముఁ జేరఁగ నిచ్చు రాజు రా
జే గుణహీన పొమ్మనిన నేమియుఁ బల్కకతండు గ్రమ్మఱన్. 4

సీ. అరిగి పట్టనవీథి నల్లన చనుచుండ
నర్జునుం డతనితో నాడినట్టి
తెఱఁ గెల్లఁ దన దగు దివ్యబోధంబునఁ
గని భుజంగోత్తమ తనయ సదయ

వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా
ఘవుని పాలికిఁ జను దెంచి యేను
మీతల్లి నాగేంద్రు సూతి నులూపి నా
పేరు హితంబు సెప్పెద మనీష

తే. నరుగుదెంచితి వినుము మీయయ్యవసువు
దలకొనుము రాజులకు సర్వధర్మమైన
యని యొనర్పుము దనతోడఁ బెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురు సత్తమునకు. 5

క. అనిన సభక్తికముగ న
వ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని య
వ్వనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 6

క. నీ వింత దెలిసి పలికెద
వావిభుఁడును మున్న నన్ను ననుమతుఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం
గావించెద నిద్దఱకు సఖండప్రియమున్. 7

చ. అని నిజమందిరమున నమ్మోలనాఁగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచితమైనరథం బుదాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్వపరి కల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నైతన మేనెల్పరఁగన్. 8

ఆ. ఎక్కి హంసకేతు వేడ్తెఱఁ గారెలంగ
నడిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ
గురిసె నతఁడు నిశితశరచయంబు. 9

శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డదిరిభి
త్సూనుం డొక్కట నాత్మసూను నొడలం దూపుల్ నిగిడ్చెం బడా

ఛానిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరుమేన్
వే నారాచములై దునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 10

చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచి యే
పొదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 11

క. అమ్మేటిమగఁడు దనచా
ప మ్మూఁత గ నిల్చి సోలి పదపడి తెలి వృ
ల్లమ్మున నొలసిన నౌరా
యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. 12

తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁ జేయు
నుద్ధతికి మంచిబంటవై యోర్వ వలయుఁ
జుమ్ము రా యని పలికి వాలమ్ము లధిక
రయము మెఱయంగఁ బరఁగించె రాజముఖ్య. 13

ఆ. మొనసి వాని నతఁడు ముత్తువియలు గాఁగఁ
జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ
దనికి సత్వరముగఁ దద్గాత్రమున నించె
నరుఁడు పెక్కు మెఱుఁగు నారసములు. 14

ఉ. దానికి నీడఁబోవక యుదగ్రపరాక్రమ మొప్ప వజ్రకీ
లానిభతన్ మెఱుంగులవిలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై నిగిడించెఁ బార్థహృదయస్థలి నారస మస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగు నన్నరపాలసుతుండు భూవరా. 15

క. వడి నది వీపున వెడలినఁ
బడియెఁ బుడమి నర్జునుండు పదపడి త్రెళ్లెం
గొడుకును మున్నతఁ డేసిన
బెడిదపుటేటులయలంతఁ బృథ్వీనాథా. 16

వ. అట్లు దసపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగుచుఁ జిత్రాంగద యులూపియుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి యచ్చెలువ యయ్యిరువురం గనుంగొని యుల్లంబు జల్లనఁ దల్లడిల్ల మూర్ఛ మునింగి మేదినిం బడి కొంతవడికిం దెలిసి యులూపి నాలోకించి. 17

సీ. నీకతంబునఁ బతి నాకుమారునిచేత
నని బడి యున్నవాఁ డతివ కంటె
నీవు పతివ్రత గావె ధర్మజ్ఞవు
గానిదానవె యేమికారణమున
నిది కార్యముగఁ జెప్పి తీపిన్నవానికిఁ
గొడుకుదిక్కున నాకునడలు లేదు
వరుఁ జూచి పొక్కెద వామాక్షీ నీదెసఁ
దప్పు సేసినను నీతనిఁ గృపార్ద్రి

తే. చిత్తవై యెల్లభంగి సంజీవితుఁడుగఁ
జేయవమ్మ యక్కట నాథు నేయఁ బనిచి
చావు సూచియు వగవవు సాహసమున
కోలఁదిలేదు నిన్నేమందుఁ గులవరేణ్య. 18

వ. అని పలికి పార్థుం జేరం బోయి. 19

ఆ. మహితకీర్తిలోల మత్ప్రాణవల్లభ
యన్యజనులప్రాణ మరసి కావఁ
జాలునట్టినీకు నేల ప్రాణంబుల
నిట్లు వదలి పోవ నిచ్చి యుండ. 20

సీ. నాథ నీ వెప్పుడు నన్ను మన్నింతువు
కను విచ్చి చూడక యునికి దగునె
హాయమున కెవ్వరు నడ్డంబు రా కుండ
నాగితి వగ్రజు నధ్వరంబు

వవశ్యము పోకుండఁ దెమ్మి త్తురంగంబు
వెనుకొన వలవదే యనఘ నీకు
నని యార్తిఁ బలవించి యహిపుత్త్రి దెసఁ జూచి
సుతుఁ డెట్టు లుండినఁ బతికి నిమ్ము

తే. జీవ మాంద్రురఁ బెక్కండ్రఁ జేసికొనుట
పురుషులకుఁ గన్పె భార్య లిత్తెరువునందు
నడవరే యోర్చి నీకుమనమున నింతే
యెఱిఁగి కలిగింపు వరు వేయు నేల తల్లి. 21

వ. అని యంత నిలువక. 22

ఆ. కొడుకుచేతఁ జచ్చి పడి యున్న యిక్కురు
కులవరేణ్యుఁ గరుణగూడి నీవు
బ్రదుకఁ జేయ కున్నఁ బ్రాయోపవేశన
మాచరింతు నహితు లాగ్రిగణ్య. 23

వ. అని పలికి పతిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యాసీనయై యూరకుండె నట్టియెడ బభ్రువాహనుండు తెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి. 24

చ. ఇంచుకయేనియుం బనట నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బిలుకక మాలినాథుని నుగ్రశత్రులక్
ముంచు వినుండుచో నిఁ బరిమార్చు మహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి నకల్పసదిత్తున కింత పెద్దయే. 25

క. గాదిలితనయుఁడ నగు నే
గా దన కింకరుకులాగ్రగణ్యుని నిప్పో
మేదినిఁ గూల్చితి నుడికిన
బోదాత్తం బైనమకుటము ముక్కం బొందన్. 26

వ. అని విలాపంబు సేసి విశ్వాన్ఫులోకం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన ప్రద్యుమ్నానిరుద్ధ వృషకేతు ప్రభృతి బాహుజనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 27

సీ. అధ్వరహాయవిషయంబు గా వీరేమి
పని సేయువారొక్కొ పార్థుఁ డిట్లు
వడి యున్నవాఁ డని పలవించి జనకుని
నిట్లు సేసినపాపుఁ డెవ్విధమున
నాచరించునొకొ ప్రాయశ్చిత్తమని పల్కి
పండ్రెండువర్షముల్ భైక్షవృత్తిఁ
నిమ్మహాత్ముని కపాలమ్మున నడపంగ
వలయుఁ గాకొం డెద్ది గలుగ నేర్చు
ఆ. నని యులూపిదిక్కు గనుఁగొని నీవు ప
న్పంగఁ దండ్రి నిట్లు ఖండనమున
విగతజీవితుఁడుగఁ దెగఁ జేసితివి నింక
నెలమిఁ బొందు భరత కులపవిత్రి. 28

వ. అని వెండియు. 29

క. జనకునిఁ దెగటార్చినపా
పునకుం బ్రాణంబుతోడి పొత్తు మనంగా
మనమునఁ దాలిమి గలుగునె
చనుఁగాక యతండు సనిన సద్గతికి తగన్. 30

వ. అని యుగ్గడించి స్థావరంబులు జంగమంబులు నగుభూతంబులు విన భుజంగపుత్త్రియు నాకర్ణింపఁ జెప్పి పత్రింబు నిష్ఠం బూనెద మాతండ్రి లేకునికి నిజం బగు నేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమకృత్యంబు వీరవధంబు పాపం బంతకంటెను రాజవధం బెక్కుడంతకంటెఁ గడునగ్గలంబు ధార్మికవధంబు జనకవధపాతకం బింత యని కొలందియిడరాదిట్లుండ వీఁడును రాజును ధార్మికుండును జనకుండును నైనయిమ్మహాత్ముని వధియించినమహాపాతకుని కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దేని నడపెద ననితలికి యుప్పరమనియుతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె నప్పుడు. 31

ఆ. అట్లు దెంపు సేసి యాసీను లైనయా
తల్లిఁ గొడుకు నవనిఁ దెళ్లియున్న

విజయుఁ జూచి పాఁపవెలఁది సంజీవన
మణి దలంచెఁ గురుస మాజముఖ్య. 32

వ. తలంచిన భుజంగమంబులకుం బరాయణం బైనయమ్మణి యమ్మహాభాగహస్త తలంబునకు వచ్చిన నాభామిని బభ్రువాహనునా ననం బాలోకించి. 33

సీ. విజయుండు సచ్చునే వేఁదుఱులార యిం
దుఁ ప్రిచేత నైన నీతనికి నొక్క
ప్రియము సేయంగఁగోరియును నీకొలఁది యా
రయుబుద్ధి నీతండు రణ మొనర్పఁ
దలఁచిన నిర్వీరు తలఁపు సిద్ధింపంగఁ
జేయుటకును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహనం బగుమాయాప్ర
యోగంబు నడపితి నుజ్జ్వలాత్మ

తే. నరుఁడు నారాయణుఁడు మహత్తరము సువ్వో
యితని తేజ మెవ్వరికిని నెట్లు దాని
నార్పవచ్చు మీావగ పెల్లఁ దీర్ప నిపుడ
యుత్థితుం డగు నీకౌరవోత్తముండు. 34

వ. మాయాప్రయోగంబ వే ఱొండు గాదు నీకు మీాతండ్రి తోడ భండనంబు సేయ బుద్ధి పుట్టించితి నింతమాత్ర యని తత్ప్రదేశం బున నున్న యెల్లజనంబులు నుల్లంబుల నానందంబు నొందఁ బలికి యమ్మణి పూరపురపతికరతలంబున నమ్మణియిడి దీని నిమ్మహాత్మునిహృదయదేశంబు మోపు మనవుడు నతం డట్ల చేయుటయుం బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. 35

తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి యెఱ్ఱ
సెరలకాంతియు దంతరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు. 36

సీ. వినయ మారంగ నాతనిచరణంబుల
కెఱఁగి భవత్పుణ్యవీక్షణమున
నఖిలంబుఁ గుశలంబ యనిన నిజ్జనముల
మొగములయం దెల్లవగవు దోఁచి
యచ్చెరువాటును హర్షంబుఁ గదిరెను
నిది యేమి సెప్పవే యెఱుఁగు దేని
నా చెప్పినట్ల రణంబున కేతెంచి
తీవు చిత్రాంగద నేల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి యేమిటి కిపుడు స
న్దెంచె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మొగిచి య
య్యహితనూజఁ జూపి యతనితోడ. 37

వ. అంతయు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతి వదనం బాలోకించి కురువంశవిస్తార కా నీరాకకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథునిదెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్న యదియె యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీ కేమియు నప రాధంబు సేయము గదా యనుటయు. 38

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి నతనితో
నాథ నీయం దొక నాఁడు నగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డెక్కడి
యది వినీతాత్మ చిత్రాంగదయును
గినియక విను మేను వినతోత్తమాంగ నై
చెప్పెద నీసుతు చేత నీకు
నావహిల్లె నశుభ మాహవంబున నీవు
గంగాతనూజు శిఖండి నెపము

తే. గాఁగఁ దెగటార్చి తది పాతకంబు దాని
కనఘ నిష్కృతి సేయక తనువు విడిచి

తేవి నరకవాసమునకుఁ బోన వలయుఁ
గాన నిష్కృతి సేసితిఁ గడఁగి వచ్చి. 39

వ. అది యెట్లం టేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సఖీసమేతం
బుగా సురనదీస్నానంబునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యింత
నంత నొక్క రేవునం దోఁచి కృతస్నాను లై నిజరూపంబున సన్నిహిత యైన
గంగాదేవితోడ గాండీవధరుండు శిఖండిం బురస్కరించికొని గాంగేయుం
జేయ కుంఠం బరమసాయకంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం
బొనర్చినయయ్యర్జును నేము శాపసంతాపితుం జేయుద మని చెప్పిన నప్పర
మానుభావయు దానికొడంబడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ. 40

సీ. అరిగి యేఁ దండ్రికి న త్తెఱం గంతయు
నెఱిఁగించుటయు నతం డెసక మెసఁగ
భయమున రయమునఁ బఱ తెంచి వసువులఁ
బెక్కువిధంబులఁ బ్రియము పుట్టఁ
దెలిచి ప్రార్థించిన నలుక వో విడిచి వా
రతనితో విను సమయం బొకండు
సేసెద మనిలోన వాసవిఁ దత్సూనుఁ
డగుబభ్రువాహనుం డస్త్రవితతిఁ
ఆ. బఱపి కూల్చె నేనిఁ బాయు నక్కిల్బిష
మనిన మగిడి వచ్చి యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె నాకు నిప్పని దగ
నిట్లు దీర్చితిని సమిద్ధతేజ. 41

వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుప
లక్షించి యిక్కుమారుండు నీతో సమరంబు సేయ నొల్లక నీకు నమస్క
రించి మరలి మందిరంబునకుం బోవు చున్కి బుద్ధిం గని సమయకార్యం
బునకు నిది యవసరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి
రణంబు మీఁతండ్రికిఁ బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బొరికిం
బురికొల్పి యిప్పోరునియందు వసువులు సెప్పినవిధంబు గలుగునట్లుగా
విక్రమవిశేషం బావహింపితి. 42

# ఋణవిముక్తి.

గౌరన.

[ఈకవి పదునాలుగవ శతాబ్దాంతమున జీవించెను. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమునే కాక నవనాథ చరిత్రమను మఱొక ద్విపద కావ్యమును రచించెను. ఇతఁడు స్కాందపురాణమందలి హరిశ్చంద్రకథ ననుసరించి మొదటిదానిని వ్రాసెను. తర్వాత శంకరకవి, శరభకవి, మల్లారెడ్డి మొదలగువారు రచించినహరిశ్చంద్రకథలకీతని గ్రంథ మే మాతృక. తన ప్రతిజ్ఞను కవి ఇట్లు చెప్పుకొనెను. లోకవులందఱు కరకంపంబుఁ జేయఁగ బఠించి వీనులపండువుగాఁగ ఇతని శైలి మృదుమధురమై లోకోక్తులతోను, స్వభావోక్తులతోను నిండి, రసవంతమై చెలువారుచుండును. ఈ భాగమున వీరబాహుఁడు హరిశ్చంద్రునిఁ గొనువిధము వర్ణితము.]

ద్విపద. అని రాజు మునివృత్తుఁ డాడువాక్యముల
విని యంత్యజుఁడు మోము వికసింపఁ బలికె
బరిణమించితి నిన్ను బాపనవరుఁగ
తిరుగక యీమాట స్థిరముగా నిలుపు
వక్కసేయని లేకి వాఁడని నన్ను
వెక్కసేయక కరాళించె నీరాజు
వాటమై యీమాట వడి నమ్మి వోల
నాటియున్నది నేఁడు నామనంబునను
గెంటకయీయప్పు గెంటి యీతులువ
బంటుగా నేలక పాయదు కోప
మప్పుధనం బింత యని గురినాకుఁ
జెప్పుము చెల్లింతుఁ జేకొను మనిన
నలరి నక్షత్రకుఁ డతని తోఁ దెలియఁ
బలికె నీభూపాలు పైఁదరువ నెడి
చేతి సంకెల వీడఁ జేసెద వేని,
దాతవు; నాపాలి ధర్మదేవతవు;
వేఁడుక జట్టిగావించి నాపూన్కి
వీడనాడకు; మాకుపిత్త మింతనిన
లోఁగియాఁతఁకుఁ గాని లోఁతనిజట్టి
తీఁగకసర్వదా విని మొదవేని

పురుషుఁడేనుఁగు నెక్కి పొడవుగా నిక్కి
వరరత్నమొగిరిపో వైచినపొడవు
ధనరాశి మాకిమ్ము; వీఁడు నీసొమ్ము
గొను మన్నవాఁడునిక్కుచుఁబల్కె, "నీకు
ధనరాశియిచ్చోటఁ దరలకయుత్తు
నొకవిచారము మాకు నొదవె నీరాజు
సుకవాసి; పనిపంద; చూపు గుడ్డెంబు;
మామిడిక్రింది సోమరి; మేదకుండు;
బూమెతుంటరి; యెనుపోతుపై వాన;
మొండరి చల్ల చప్పుడు గోడచేర్పు
చండిపోతనునట్టి జాడనున్నాఁడు,
చెప్పినపని జాగుసేసినవేళ
ముప్పిరిగొను కోపమున మొఱపెట్ట
దుడ్డునవీఁపు కంతులుగట్ట మోఁది
జడ్డువాపినఁ గొల్వు చాలునాకనుచుఁ
దక్కిపోయిన వెంటఁ దగులనావశమె?
యుక్కునఁ బెనఁచినట్లున్నాఁడువీఁడు
గొలుసుదప్పినయట్టి కోఁతిచందమునఁ
గలధనమీవురొక్కముగొని పోదు
విల్లాలుఁ బుత్త్రిలు హితులు బంధువులుఁ
దల్లిదండ్రులు నన్నదమ్ములుఁ గలుగు
వాని నెమ్మది నమ్మ-వచ్చుఁగా కిట్టి
వానిసేగతి నమ్మనచ్చునా? కనిన
నక్షత్రకుండు భూనాయకుఁజూచి
దక్షతఁజండాలుఁ దగనొడంబఱిచి
పూఁటపూఁటకు జరుపుడు పుచ్చిచనక
పూఁటకాఁపవెనీవు? పొమ్మనియనక
మితివోకమున్నె నీమీఁది ధర్మంబు
మతమునఁజెల్లింపుమాకిప్పు డనుచు

బోధించి పక్కలు వాడుచునవ్వుడుగు
బాధకునలసి భూపతి మదిలోన
నెడపకధనముఁ బ్రోవిడి "నేఁటితోడఁ
గడతుఁ గౌశికుమాయ ఘట్టమే" ననుచు
వీరబాహునిఁ జూచి వినుమనిపలికె
నీరీతినపనమ్మి కేలనామీఁదఁ?
జాల నీతని కల్కి సత్యంబుకొఱకు
నూలిపోగునఁజిక్కి నుసలకున్నాఁడఁ
దల్లి సత్యమునాకు దండ్రిసుజ్ఞాన
మెల్లెడ సోదరుఁ డెగఁగుధర్మంబు
చెలువారధైర్యంబు చెలికాఁడు శాంతి
కులసతి వినయంబుకొడుకు చర్చింప
నేసత్యమునకుఁ గా నిప్పుడునీకు
దాసుఁడనై జట్టి దక్కుచున్నాఁడ
నట్టిసత్యంబు నేఁడగు నాకుఁబూఁట
గట్టిగాఁ జేపట్టి కలఁకపోవిడువు
నీయాజ్ఞఁదలమోచి నీకనుసన్నఁ
బాయక నీపంపుపనులొడఁగూర్తు
నలఁగక నాచేయు సంతకాలంబు
నలసిన, సొలసిన, నటు నిటుఁబడిన
మఱచిన, వెఱచిన, మఱిసేధనంబుఁ
జెఱచిన, బఱచినఁ జేయలేననిన
విసికిన, గసికిన వెడనిద్రనొంది
నుసిలిన మసలిన నొప్పిఁ జెప్పినను
మెఱుఁగులు గ్రమ్మునామేటి ఖడ్గమునఁ
దఱిఁగి రక్తముగాఱఁ దనతలఁద్రెంచి
నీపాదములమీఁద నిలుపుదునిదియె,
నాపూని "కనిన నంతట సమ్మతించి
వీరబాహుండు తనవెంట నేతెంచు

ఘోరమూర్తుల నతిక్రూరవర్తనులఁ
దనకింకరులఁ బంపి ధనముఁ దెప్పించి
ఘనతరపర్వతాకారంబుగాను, 40
పెనురాసి పోయించి ప్రియము రెట్టింప
ముని కుమారున కిచ్చి మ్రొక్కి "పొమ్మ" నిన
నతఁ డ్రతకుండఁ డానందంబు నొంది
లక్షభంగుల నృపాలకుని దీవించి
"యుర్వీశ! నాకు నీ వొసఁగు బద్ధధనము
సర్వంబుఁ జెల్లె నీశ్వరసాక్షిగాను।" 43



## పతివ్రత.

అనంతామాత్యుఁడు.

[అనంతామాత్యుఁడు భోజరాజీయము, రసాభరణము, ఛందశ్శాస్త్రము, అను మూఁడు గ్రంథములను రచించెను. రసాభరణమును క్రీ. శ. 1435 సంవత్సరమున ముగించినట్లు ఇతఁడు వ్రాసికొని యుండుటచే ఈకవి పదునైదవశతాబ్దాదిలో నివసించియుండెనని చెప్పఁగలము. భోజరాజీయము మనోహరమైనకథలతో నిండియున్నది. ఇది అహోబల నృసింహస్వామి కంకితము ఇతని శైలి సలక్షణమై, సందర్భశుద్ధి గలిగి, అనర్గళధారతో ఒప్పుచుండును.

పాఠ్యభాగము అన్నదానమహిమఁగూర్చి చెప్పును. భోజుఁడు సర్వటియను సిద్ధునిఁ దనయింటికి రావించి యాతనివలన ననేకచరిత్రలను, మహిమలనువినును ఇది భోజరాజీయము-షష్ఠాశ్వాసమునుండి సంగ్రహింపఁబడినది.]

క. అప్పుడు సయ్యానుజన్ముఁడు
తప్పక యతిఘ కన్నదానము వినయం
బొప్పఁగ నిడునది గారణ
మెప్పుడు సిరి గదల దతనియింటఁ నృపాలా. 1

వ. ఇట్లు జరుగుచుండ నొక్కనాఁ డవ్వదినెలు దమ మఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపఁదలంచి తమపురుషులం జేరి సఖేదంబుగా నిట్లనిరి. 2

ఉ. అత్తకు మేము మార్పలుక మాయమచిత్తములోని వారమై
వత్తుము పెద్దవారుగలవారికి నన్నియుఁ జెల్లుఁ గాక నేఁ
డిత్తఱి మమ్ముఁ బుచ్చి పని యెవ్వరు గొందురు మిమ్ముఁ జూచి నో
రెత్తగ నోడి యేపలుకు లెన్నఁడుఁ జెప్ప వెఱింగి యుండియున్. 3

వ. అని పలికి తమతోడికోడలిం బ్రసంగించి. 4

క. పనిపంప వెఱతు మాబిడ
పని యెప్పుడు చేసిచేసి పాయపడితిమె
వ్వని రాజ్యమని యెఱుంగదు
తనచేఁతకుఁ దోఁడు మమ్ముఁ దప్పులుపట్టున్. 5

క. తా మాకు సత్త్రయైనది
యామఱఁదియు మాకు మామయై వర్తించున్
నే మయ్యిరువుర చేతను
బాములఁ బడలేము నారిపాములభంగిన్. 6

ఉ. పాటుల పేరు చెప్పుకొని బానెఁడుపప్పును బాయసంబునై
దాఱు పనంట్లవంటకము సాజ్యముఁ గమ్మని కూరగాయలున్
జూఱలు దించు వారసతి చొప్పున గొల్లను మీటుకొంచు మా
తో రోదగొట్టు నీదగరతోఁ బడఁజాలము వేయిచెప్పినన్. 7

క. తనగడన లేదు మీ తె
చ్చిన యవి తోఁస్తోన వ్యయము చేసెడి నింకీ
తనితోడి పొత్తు పదివే
లును వచ్చె మనకు విభక్తులును గావలయున్. 8

క. తనయాలును దానును గుడు
వను గట్టను నిట్టి యీయవస్థలఁ బడ నే

మును వీరును నెఱచాలుఁ
దనిసితి మీ బ్రతుకు పట్టు దయ్యెమెఱుఁగన్. 9

వ. అనవుడు నది యట్టిదయగు యన్నదమ్ములు నిజానుజుం బిలిచి దేశకాలవిశేషోపన్యాసంబు మొదలుగా సముచితప్రసంగంబులు తొలుత సలిపి తదనంతరంబ యిట్లనిరి. 10

ఉ. ముండటిభంగి కాదు కడు మూర్ఖతనంబులు పెద్దయింటిలో
నిండఁజేయొజయుం జెఱచు నేపనికైనను బొడ్డువంపలే
దంపుకుఁ దోడు చీమచిటుకన్నను వాడుకు వచ్చుచుండు నీ
సుందరిలాగులే వలనఁ జూచిన లెస్సలు గావు తమ్ముఁడా. 11

క. సిరిను మఱికలిమి వెలుఁగు
దే వారికైననఁ బుట్టెటిది బుద్ధియె నీ
కావిద్య వెన్నతోడిది
గావున వలదన్న మానఁగా నేర్చదవే. 12

చ. అనవుడుఁ జిన్నవోయి యతఁడా ననమించుక వంచి వీరలి
ట్లనుట మహీసురావళికి నన్నము పెట్టుట మాన్పఁగాదె యే
మనినను మానఁజాల నని యాత్మఁ దలంచుచు వారిమోము గ
న్గొని యొకకొంతసేపటికిఁ గొంకక బింకముతోడ నిట్లనున్. 13

క. ఎప్పుడు సహజన్ములగుట
దప్పుడునే వేరు వడుట తప్పే మున్నీ
చొప్పిలఁ గలదియ కాదే
యిప్పుడు నిర్ణయము సేయుఁ డీరని పల్కెన్. 14

వ. ఇట్లు తమలో సంవాదించి యయ్యన్నదమ్ములు మువ్వురు విభక్తులై పిన్నతని నొంటిఁజేసి పెద్దవాగద్దఱు నొద్దికలై కలిసియుండి పరోపకారంబున కవకాశమీయరైరి. అంతవారింటఁ గుటుంబభారము నందు బుఱ్ఱింగుమపడ శిశువులు కూడుకూడనుండ వారిభార్యలు. 15

ఉ. మగలమొగంబు చూచి యణుమాత్రియుఁ బేదటికంబు లేక ఖ్యా
తిగ మనుచున్నవాఁడు భవదీయకనిష్ఠుఁడు వానిఁ బట్టి పా
లుగొనఁగ రాదెమున్నతఁడు లోన నడంపగఁ బోలు సొమ్ము మీ
క గపడకున్న రాజునకు నైన మొఱో యని చెప్పఁజాలరే. 16

వ. అని పల్కుచుండిరి. చిన్నవాఁడు సౌజన్యధనుఁడు గావున విశేషతిథులయందు సపుత్రకళత్రంబుగాఁ దనయగ్రజన్మతయంబు రావించి తనపంక్తి నశనంబు పెట్టుచుండును. బ్రాహ్మణోత్తముల ప్రతిదినంబును నతనిగృహంబున నాహారంబు గొనుచుందురు. ఒకదినం బాతని గృహిణి యాగృహస్థునితో నిట్లనియె. 17

క. మీరెల్లపుడు విప్రస
మారాధనతత్పరాత్ములయి వారల కా
హారములు వెట్టుచుండుదు
రా రయ నందునగు సిద్ధి మది యెద్ది యొకో. 18

వ. అనవుడు నాతండీవిషయము కాశికాపురనివాసుఁడు విశ్వనాథుఁడు వరించుగంగ యెఱుంగు నేనామెవలన నీవృత్తాంతమె తెలిసి వచ్చెద. 19

క. ఆఁకొనివచ్చిన విప్రుల
దాఁకింపక యశనమిడుము తత్పరమతి న
ఞ్జాఁకలి సేయకు కుడువం
దోఁకొని రా పర్వమగుతిథుల మనవారిన్. 20

క. అని చెప్పి యాతఁడరిగిన
వనితారత్నంబు విప్రవరులకు నన్నం
బనుదినము పెట్టుచుండఁగఁ
గన విష్ణుఁడు దానిచిత్తగతి యరయంగన్. 21

వ. కోల యూఁత గొనుచు వచ్చి దానియింటఁ గూర్చుండఁబడి కంఠగతప్రాణుండు వోలెం దద్గృహాభిత్తి నొత్తిగిలియున్న యన్నీరజ

నాభుకపటవేషంబు చూచి కేవలవిప్రుండుగా వగచి యితండెంతదవ్వుల
నుండి వచ్చెనో కదే యంచుఁ గడు డస్సియున్నవాఁడని తత్తఱించుచు
నతనియడుగులు గడిగి తాలవృంతానిలంబున సేదదీర్చి తండ్రీ నీవెవ్వ
రెందుండివచ్చితెట వోయెదేమియిచ్చ యనిననతఁడయ్యతివకిట్లనియె. 22

సీ. ఒకచోటఁ గాదు నాయునికి యెచ్చటనైన
నుండుదుఁ జుమ్మి నాథుండ నేను
ననుఁ బ్రీతి నిందు రమ్మని కట్టెడశనంబు
పెట్టు ధర్మప్రాణి పుట్టునొక్కొ
యని యెందుఁ జరియింతు నతివ నేఁటిప్రయాణ
మున మహాతపముచే ముట్టఁబడితి
నేమి సేయుదు నింక నీయస్థిరదేహ
మెట్టుగానున్నదో యీయవస్థ

ఆ. వె. కేదిగతియొ నాకు నేమియు నిచ్ఛగా
దనుచు మాటమాట కధరపుటము
దడుపుకొనుచు డప్పి నగుచు నీరెల్లుతోఁ
జెప్పె దైన్యరసము చిప్పిలంగ. 23

వ అంత నాసాధ్వి. 24

క. కడునాఁకొంటిరి లెండని
వడిఁ గదళీదళము పఱచి వనితారత్నం
బొడికముగఁ గూడుగూరలు
నిడునంత ననేకవిప్రులే తెంచుటయున్. 25

వ. అప్పుడవ్విప్రరూపశోభితుండగు విష్ణుండ వ్విప్రవనితం జూచి
యిట్లను మీరన్నదానంబు సేయుదురని విని యిందు వచ్చి వెఱ్ఱివాఁడ
నైతి నా దేహంబడిచి పశియొడు నీచేసినయన్నంబల్పంబీ వచ్చినమహాను
భావులం జూచితి గదా వీరలదీపనాగ్నులు దావాగ్నిబడబాగ్నులకంటెు
నతిశయించి యున్నయవి నీవేమిట వార్చెదవు చెప్పుమనిన నవ్విప్రవనిత

తండ్రీ నీప్రసాదంబున నన్నియు సమకూరెడుం గాక కొంచెపడియెదు నే
వారి పనికింత చింతింపనేల మీరారగింపుఁడ పిన సలండి ట్లనియె. 26

క. క్షుత్పీడితులై వచ్చిన
సత్పురుషులఁ గనియుఁ గుడువఁ జాగునె హస్తం
బుత్పలలోచన నన్నిటు
తాత్పర్యవిహీనుఁ జేయుదా యిచ్చోటన్. 27

క. అని యటుచేతనె యాపో
శనముం బట్టుకొని యున్న చలమరిఁ గని యా
వనిత చలింపని నెమ్మన
మున విప్రుల కర్ఘ్యపాద్యములు దగ నిచ్చెన్. 28

చ. అసదృశలీల నవ్వనిత యంబుఘటావళిక్రింద నున్న యా
యిసుకటు చేటలం జెరిగి యింపగు బియ్యము చేసి వేడ్కతో
నెసరులఁ బోసి వండి వెర వేర్పడ నయ్యశనంబు భూదివౌ
కసులకుఁ బెట్టెఁ గద్దనిసి గ్రక్కున నాఁకలి దీరునట్లుగన్. 29

సీ. ఉదయపర్వతమెక్కకుండ భానునిఁ ద్రోల్చి
వారించినది పతివ్రతయ కాదె
హరిహరాబ్జజుల ముగ్వురఁ దనూజులఁ జేసి
పాలించినది పతివ్రతయ కాదె
యముఁబట్టి మగనిప్రాణము మరల కన్నులు
రావించినది పతివ్రతయ కాదె
ప్రజలెల్ల మ్రొక్కంగఁ బతిఁ గూడి వినువీధి
వర్తించినది పతివ్రతయ కాదె

ఆ. వె. సత్యశౌచములకు జన్మదేశము పతి
వ్రతయ కాదె శాస్త్రమతమునందుఁ
గాన మహిఁ బతివ్రతానుభావము పేర్మి
నభినుతింపఁగలరె యన్యజనులు. 30

వ. ఇట్లు పతివ్రతాతిలకం బావిప్రసమూహంబునకు నాహారంబు పెట్టిన విష్ణుండు నిజరూపంబు చూపి. 31

క. మెచ్చితి నీకొకవర
మిచ్చెద వేఁడుమని యానతిచ్చె విభుఁడు మీ
రిచ్చువర మెందుఁ బోయెడు
నచ్చపుఁ గృప నారగింపుఁడనియె వనితయున్. 32



## వర్షకాల వర్ణనము.

[జక్కన విక్రమార్క చరిత్ర - చతుర్థాశ్వాసమునుండి యుద్ధృతము]

క. వేసవి వేఁడి సహింపక
వేసరుజీవులకు నెల్ల విశ్రాంతికర
శ్రీసంపాదనకరమై
యాసన్నంబయ్యె నంబుదాగమ మంతన్. 1

ఉ. తూనిఁగలాడెఁ దోయనిధిఁ దోరపుస్రోతజ నించెఁ బంక్తులై
కానఁబడెన్ బలాకములు కప్పయెలుంగు చెలంగె నిర్జల
స్థానమునందుఁ గుంజము తుదం గృకలాసము నిల్చి నింగికై
యాననమెత్తె భూమిరజ మంగములన్ బెరయించెఁ బిచ్చుకల్. 2

క. తదనంతరంబ జనముల
కిది పగలిది రాత్రి యనుచు నేర్పఱుపంగా
హృదయముల కగోచరమై
చదలం బొదలంగఁ జొచ్చె జలధరవితతుల్. 3

మ. దళితానంతదిగంతమై ఘుమఘుమధ్వానంబు సంధిల్లఁగాఁ
గలయం బాములఁ వ్రేలఁగట్టినటు లుగ్రవ్యగ్రలీల న్నిర
ర్గళధారాళకరాళమై కురిసె వర్షం బెందు నేయింటివా
రలుఁ బొర్గింటికి నేఁగకుండఁగ నహోరాత్రంబు చిత్రంబుగన్. 4

## స్వార్థపరార్థులు.

శ్రీనాథుఁడు.

[శ్రీనాథుఁడు పదునైదవ శతాబ్దమధ్యమునందుండెను. కొండవీటి నేలిన రెడ్డిరాజులయొద్దను, పిమ్మట రాజమహేంద్రి నగరమును బాలించిన రెడ్డిరాజులయొద్దను విద్యాశాఖాధికారిగను, ఆస్థానకవిగను నుండెను. తానురచించిన శృంగార నైషధము కాశీఖండము, భీమఖండము, హరవిలాసము మొదలగు గ్రంథములను రాజులకో, రాజాశ్రితులకో అంకితమునిచ్చెను. ఇతఁడు దేశసంచారము చేసి యనేక పండితులను వాగ్వాదమున నోడించి లోకప్రఖ్యాతి గాంచెను. ఇతనికి కవి సార్వభౌముఁడను బిరుదము కలదు.

సంస్కృతమున శ్రీహర్షకవి శృంగార నైషధము రచించెను. విద్వదౌషధమని పేరొందిన నైషధము నితఁ డాంధ్రీకరింపఁ బూనుటయే యీతని వైదుష్య మెట్టిదో తెలుపఁగలదు. పాఠ్యభాగము శ్రీనాథుని శృంగార నైషధములోనిది. నలుఁడు దమయంతీ స్వయంవరమునకుఁ బోవుచుండ దిక్పాలు రాతని నెదుర్కొని తమ దూతగఁ బంపఁదలఁచి యీవిధముగా మాట్లాడిరి.]

తే. గీ. విమలతర దివ్యగగన యానములమీఁద
ధరణిఁ గొలువున్న యాదిగీశ్వరులఁ జూచి
యద్భుతాక్రాంతచిత్తుఁడై యధిపసుతుఁడు
చేరఁ జనుదెంచె నంతంతఁ దేరుడిగ్గి. 1

వ. ఇవ్విధంబున రథంబు డిగ్గి మూర్తంబైన రామణీయకగుణాద్వయవాదంబునుం బోని యమ్మేదినీరమణుండు సుత్రామాదివిబుధరాజచయంబునకు నభివాదనం బాచరించి ప్రాంజలియై పార్శ్వంబున నిలిచియుండె, నయ్యమృతాశు లతనిం జూచి దమయంతీనిరాశంబులైన యాశయంబులతోఁ బరస్పరముఖావలోకనంబులు చేసిరి. అప్పుడు వంచనాకపట నాటకసూత్రధారుండైన శునాసీరుం డా నృపకుమారున కిట్లనియె. 2

సీ. అన్న యెవ్వరివాఁడవయ్య సేమమె నీకు?
నైషధుండను బుద్ధి నాకుఁ బొడమె;
గారాపుఁజెలికాఁడు వీరసేనుఁడు మాకు
నాతని రేఖ నీయందుఁ దోఁచె

నేమి కార్యముఁ గోరి యిటు వోవుచున్నాఁడ?
చెప్పుడు నీచారిత్ర మేము విందు;
మెఱుఁగుదో నీవు మమ్మింక లెస్సగా?
నెఱుఁగకుండిన నేమి? యెఱిఁగికొనుము;

తే. గీ.. దండపాణి యితం డనలుం డతండు
వరుణుఁ డీతఁ డేను నిర్జరవల్లభుండఁ;
బిండితార్థంబు విను; మేల పెక్కుమాట
లర్థులైవచ్చితిమి మము నాదరింపు. 3

వ. మహార్తమాత్రంబున మార్గఖేదం బవనయించి కార్యని
వేదనం బొనర్చెద మనిపలికి యభిధాకౌశలుం డైన యవ్విబుధనాయకుం
వారకుండిన. 4

తే. అర్థి యనుపేరు చెవిసోఁకినంతమాత్రఁ
జాముకోఁ బులకించె సజ్జనవిభుండు
ప్రావృషేణ్య పయోధర ప్రభవమైన
గాలి వనిచిన నీపవృక్షంబు వోలె. 5

వ.. ఇట్లు సంతసిల్లి భూవల్లభుండంతర్గతంబున. 6

క. త్రిదశులకును దుర్లభమై
మదధీనంబైన యట్టి మంచిపదార్థం
బది యెట్టిదొ కోర్కె వేగమ
యొదవునొకో యడిగినప్పుడ యుచితంబునకున్. 7

తే. అడిగినప్పుడె యిత్తునే బాగ్యమైన
నర్థిమాత్రంబునకు వేడ్క నతిశయిల్ల
నట్టి యొనిందు నెంతవాఁడాసపడిన
నకట యేమిచ్చి పరితోషమందువాఁడ. 8

క. పాత్రంబుకంటె భీమా
క్షోణీపతనూజమీఁదఁ గూర్మిగలదు నీ

ర్వాణాధీశ్వరుఁడయ్యెలి
వేణీ! మదిఁ గోరెనేని వేగమ యిత్తున్. 9

గీ. ఎద్దియొకొ వీరియభిలాష మెఱుఁగుభంగి
యడుగకయ మున్న యీవి భాగ్యంబుగాదె
వాంఛ నెఱిఁగియు నర్థార్థి వచనదైన్య
మాత్మసహింపఁ జాలువాఁడధమదాత. 10

మ. కటికితనంబు మాన్చి చటుకాకువిడంబముఁ గూర్చి లజ్జసం
కటపడఁజేసి యర్థిఁ గడుఁగాఱియ పెట్టిన పాతకంబు న
క్కట తలఁగంగఁజాలునొకొ కాలవిలంబము నాచరించి పి
మ్మటఁదదభీప్సితార్థము సమర్పణ సేయుప్రదాత యెన్నియున్. 11

చ. కమలము పంకసంకరవిగర్హిత మర్హముగాదు నిల్వఁగాఁ
గమలకు నంచు నెంతయును గౌతుక మింపెసలార నర్థిదోః
కమలము నిర్మలంబు నతిగాఢవివేకులు తద్విహారస
ద్మముగ నొనర్తు రప్రతిమదానకళాకలనాధురీణతన్. 12

ఉ. దాన కళా కలాప సముదంచిత సారవివేకసంపదన్
మానితయాచమాన జనమానసవృత్త్యభిపూర్తిబుద్ధి యె
వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబు ధాత్రికిం
గానలు గావు శైలములు గావు పయోధులు గావు భారముల్. 13

గీ. తలఁపసధమర్ణుఁడొ కఁడు ప్రదానపాత్ర
మిచట నొక్కటి గొని మీఁదనిచ్చుఁగోటి
సుకృతసంపదఁ బారలౌకికకుసీద
మాసపడువారి కిదియ బేహార మరయ. 14

వ. అని ముహూర్తమాత్రంబు చింతించి యానిషధరాజు ప్రసన్న
ముఖుండై యాబర్హిర్ముఖుల కిట్లనియె. 15

గీ. ఏను చేసినపుణ్యంబు లెట్టివొకొ ని-
ఫలితమయ్యెను మత్పూర్వపరమతపము

లింతకల్యాణకరమహానె యీదనంబు
కౌతుకం బారదర్శింపఁ గంటి మిమ్ము. 16

వ. నాయందు మీ రపేక్షించిన ప్రయోజనం బానతిండు ప్రాణంబైనను బ్రాణాధికంబైనను నదెట్టిపదార్థంబైన నిచ్చెదనని నిర్వ్యశంకంబుగాఁ బలికినయుర్వీశ్వరునకు గీర్వాణవల్లభుం డిట్లనియె. 17

ఉ. ఓమిహికాంశు వంశకలశోదధి కౌస్తుభరత్న భూపతి
గ్రామణి యస్మదీయమగు కాంక్షితమున్ విను భీమపుత్రిపైఁ
గామన సేసి వచ్చితిమి గమ్ము సహాయము మాకు సిక్కపుం
బ్రేమయు భక్తియు న్గృపయుఁ బెంపుగఁ జేయుము దూతకృత్యమున్.

వ. భూమండలంబున రాజనందను లెందఱు లేరు? వారిప్రయోజనం బేమి? యంబరంబునం దక్కినగ్రహంబులు గ్రహరాజుం బోలనేర్చునే? యగాధగుణాంభోధి వగునీవు సహాయంబుగా మాకు సాధింపరాని కార్యంబు గలదే యని పలికిన. 19

గీ. బలనిషూదను కపటంపుభాషణములు
విని నృపాలుండు పలికెఁ దద్విధము గాఁగఁ
గుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ
యర్హ మగుఁ గాని నీతిగా దార్జవంబు. 20

వ. అఖిలభూతాంతర్వర్తనంబుల నెఱింగెడు మీకు నెఱుంగం బడనియర్థంబును గలదె యట్టి మీరిట్టివిధంబున నానతిచ్చిన నేమి యనం గలము? ఏనయ్యంగనం గోరి వరియింపఁబోవుచున్నాఁడ నమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయనేర్తు. ఏను మీరహస్యం బెల్ల రక్షింపనోపుదు మనోరథపరంపరాసుధారసంబునఁ బరవశుండైన నాకు భావగోపనం బెట్లు సిద్ధించు వివిధరక్షాధికృతపాలితంబులైన రాజశుద్ధాంత భవనకక్ష్యాంతరంబు లేపరి కారంబునం బ్రవేశింతుఁ బెద్దకాలంబుననుండియు నాయాదు వినుకలిం దద్దయుం గలిగియున్న యమ్ముద్దియతో మీప్రసంగం బెబ్బంగి

జేయుదుఁ గాన హాస్యకారణంబగు నికార్యంబునకు నన్ను భారకుం
జేయకుం డనిపల్కినఁ బౌలోమీవల్లభుఁ డిట్లనియె. 21

సీ. ఈమాటలాడకు మిందువంశవతంస
యాఁడి తప్పఁగ వచ్చు నయ్య నీకు
క్షణభంగురం బైన సంసారమునకుఁగా
ధర్మంబుఁ గీర్తియుఁ దగునె విడువ
నన్వయంబున కాదియగు చందురుఁడు వోలె
నకల కళంకి వేలయ్యెదీవు?
చిరకాలమున నుపార్జింపఁబడ్డ ప్రసిద్ధి
సేగిఁబొందగ నుపేక్షింప వలదు

తే. గీ. పరుసనైన చింతామణిఁ బసరమైన
కామధేనువు ద్రుమానైన కల్పకంబు
నడిగి వైఫల్యమును బొంద రర్థిజనులు
మిన్నకయ పోదుమే యేము నిన్ను నడిగి? 22

చ. అసదృశదానవైభవమహాగుణధన్యుని నిన్ను దేవతా
విసరము యాచకత్వమున వేడఁగవచ్చుట కారణంబుగాఁ
బ్రసవవికాసమాత్రమునఁ బాండురభాసము నొందుఁ గాక యా
కసము యశోవిహీనమగు కల్పమహీరుహపంచకంబుచేన్. 23

ఉ. అక్షరముల్ పఠించుసమయంబునఁ బాఠము సేయఁడయ్యెనో?
శిక్షితవర్ణమధ్యమునఁ జెందెనొ విస్మృతి? యంచు, నర్థులు
ప్రేక్ష యొనర్తురే క్రియనభీష్టఫలప్రతిపాదనక్రియా
దక్షుని నిన్నుఁ గూర్చిన యనర్హనికారమున న్నకారమున్. 24

శా. ఈయర్థంబు ఘటింపవన్న నృప నీ కెంతేని మేలయ్యెడున్
మాయాశీర్వచనంబులం ద్రిజగతీమధ్యంబున న్నీయశ
శ్ఛాయామండల మిందుకుందకుముదస్వచ్ఛంబు సంధించు సం
ధ్యాయుక్తిన్ శితిపీతరోహితహరిద్వర్ణోపసంహారమున్. 25

వ. "స్పష్టము. 26

తే. గీ. అధిప మాకిది పురుషార్థమనియె వహ్ని
పార్థసము చేకొనుమటంచుఁ బలికె జముఁడు
రాజ యన్యోపకార సంప్రభవమైన
యశముఁ గైకొనవయ్య నీవనియెఁ బాశి. 27

వ. ఇత్తెఱంగునం జాటుగర్భంబులైన వేల్పులవాక్యసందర్భంబు లాకర్ణించి వైదర్భీవివాహకౌతూహలియయ్యును దద్దూత్యభారంబు వహించె. 28



# ఏకక్రియా ద్వ్యర్థకరి.

పోతన.

[బమ్మెరపోతన క్రీ. శ. రమారమి 1400 నుండి 1460 వఱకు జీవించెను. ఇతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; ఏకశిలానగరవాసి; సహజపాండిత్యయను బిరుదముగలవాఁడు శ్రీరామభక్తుఁడు; నరాంకిత మీయరాదని తలఁచి తనభాగవతమును శ్రీరామున కంకితము చేసెను. ఇతనికవిత శబ్దాలంకారములతోఁ గూడి మాధుర్యగుణసహితముగ నుండును. ఇతఁడు భోగినీదండకమును, వీరభద్రవిజయమును వ్రాసెనను వాడుకగలదు.

పాఠ్యభాగమున శ్రీకృష్ణుఁడు సత్యభామను, జాంబవతినిఁ బెండ్లాడుకథగలదు. ఇది భాగవత దశమస్కంధములోనుండి గ్రహింపఁబడినది]

వ. సత్రాజిత్తను వాఁడు సూర్యునకు భక్తుఁడై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు శమంతకమణి నిచ్చె, నామణి కంఠంబున ధరియించి సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకా నగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటలతిరోహితదృష్టులై సూర్యుండని శంకించి వచ్చి హరి కిట్లనిరి. 1

మ. దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ నిన్ జూడ యా
దవవంశంబున గూఢమూర్తి వి జగత్త్రాణుండ వై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేఁ డదె రుచి ప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో నీరజగర్భుఁడో యొకఁడు చేరన్ వచ్చె మార్గంబునన్. 2

వ. అని యిట్లు పలికిన మూఢజనులం జూచి గోవిందుండు నగి మణిసమేతుం డైన సత్రాజిత్తుండు గాని సూర్యుండు గాఁ డని పలికిన నంత సత్రాజిత్తుండు శ్రీయుతుండయి మంగళాచార సంచారితం బైన తనగృహంబునకుం జని మహీసురులచేత నిజదేవతామందిరంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నది ప్రతిదినంబును నెనిమిదిబారువుల సువర్ణంబు లొసంగుచుండు. 3

క. ఏరా జేలెడు వసుమతి
నారత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్వమాయిక
మారీ దుర్భిక్షభయము మాను నరేంద్రా. 4

క. అమ్మణి యాదవవిభునకు
ని మ్మని హరి యడుగ నాతఁడీక ధనేచ్ఛన్
బొమ్మని పలికెను జక్రికి
నిమ్మణి యీకున్న మీఁద నేమౌ ననుచున్. 5

వ. అంత. 6

చ. అడరెడువేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోరవన్యమృగయాతతి నేగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁగొంచు నొక్కహరి పాఱఁగ దాని వధించి డాసియే
ర్పడఁగను జాంబవంతుఁడు ప్రభాతదిగంతము నాశమంతమున్. 7

క. కని జాంబవంతుఁ డామణిఁ
గొని పోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమిసుతకును
ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా. 8

వ. అంత సత్రాజిత్తుండు తనసహోదరుఁ డైన ప్రసేనునిం గానక
దుఃఖించుచు. 9

మ. మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టివధించినాఁడు హరికిఁ మర్యాద లేదంచు దూ
షణముం జేయఁగ వానిదూషణము గంసధ్వంసి యాలించి యే
వ్రణమున్నాయెడలేదునింద గలిగెన్వారించు టేరీతియో. 10

వ. అని వితర్కించి. 11

మ. తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచుఁ వచ్చి త
ద్వనవీధిం గనె నేలఁ గూలినమహాశ్వంబుం బ్రసేనుం బ్రసే
నుని హింసించిన సింహముఁ మృగపతి న్నొప్పించిఖండించియే
గినభల్లూకముచొచ్చియున్నగుహయుంగృష్ణుండు రోచిష్ణుఁడై. 12

వ. కని తనవెంట నంటి వచ్చిన పరిజనుల నెల్ల గుహాముఖంబున
విడిచి సాహసంబున మహానుభావుం డైన హరి నిరంతర నీరంధ్రనిబిడాం
ధకారబంధురం బై భయంకరం బై విశాలం బైన గుహాంతరాళంబు సొచ్చి
చని యక్కడ నొక్కబాలిక కెదుర దర్శనీయ కేళికందుకంబుగా వ్రేలం
గట్టిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరింపనిశ్చయించి. 13

క. మెల్లనె పదము లిడుచు యదు
వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము
మొల్లంబుగఁ దానిదాది మొఱ వెట్టె నృపా. 14

వ. అంత నాధ్వని విని బలవంతుం డైన జాంబవంతుండు వచ్చి
తన స్వామి యని కృష్ణు నెఱుంగక ప్రాకృతపురుషుం డని తలంచి కృష్ణు
నితో రణంబు సేసెనందు. 15

క. పలలమునకుఁ బోరెడు డే
గల క్రియ శస్త్రములం దరులఁ గరములు విజయే

చ్ఛల నిరువదిరెండవయిదిదిన
ములు పోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్. 16

క. అడిదములఁ గరులు విఱిగిన
బెడిదము లగు మగతనములఁ బిఱుతిసక వడిన్
బిడుగులవడువునఁ బడియెడి
పిడికిటఁబోడుచుటలు గలన బెరసి రిరువురున్. 17

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి నహర్నిశంబు జయసంమోహంబులం బోరుచోఁ
బుష్టింబాసి ముకుంద ముష్టిహతులం బూర్ణశ్రమోపేతుఁడై
పిష్టాంగోరుశరీరుఁడై యతఁడుదా భీతాత్ముఁడై యిట్లనెన్. 18

వ. దేవా నిన్నుఁ బురాణపురుషు సర్వేశ్వరుం డైన విష్ణుం బ్రభవిష్ణుంగా నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వ రాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ యాత్మకుం బరమాత్మవు నీవ యని మఱియును. 19

సీ. ప్రాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి
నింకించి బంధించి యేపు మాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే
దానవగర్వాంధ తమస మడఁచెఁ
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడుఁ
దశకంఠుకంఠ బృందములఁ ద్రుంచెఁ
నాచంద్రసూర్యమై యమరుల లంకారాజ్య
మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె
తే. నన్ను నేలిన లోకాధి నాథుఁ డెవ్వఁ
డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవ కావె మహాత్మ నేఁడు
మాఱుపడి యెగ్గుఁ జేసితి మఱువ వలయు. 20

వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతనిశరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరి తనకరంబున నతనిశరీరంబు నిమిరి మేఘగంభీర సంభాషణంబుల నిట్లనియె. 21

క. ఈమణి మాచేఁ బడెనని
తామసు లొనరించు నింద దప్పుటకొఱకై
నీమందిర మగు బిలమున
కే మరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే. 22

వ. అనిన విని సంతసించి జాంబవంతుండు మణియునుం దనకూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిఁ గానుకగా సమర్పించె, నట మున్ను హరివెంట వచ్చినవారలు బిలంబువాకిటం బండ్రెండుదినంబులు హరిరాక కెదురు చూచి వేసరి వగచి తమ పురంబునకుం జని, రంత దేవకీవసుదేవులును, రుక్మిణియును, మిత్రబంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి కృష్ణుండు రాక చిక్కె నని శోకించి, 23

క. దుర్గమ మగు బిలమున
హరి నిర్గతుఁడై చేరవలయు నేఁడని పౌరుల్
నర్గములై సేవించిరి
దుర్గఁ గృతకుశలమార్గ దోషితభర్గన్. 24

క. డోలాయితమానసులై
జాలిం బడి జనులు గొలువఁ జండిక పలికెన్
బాలామణితో మణితో
హేలాగతి వచ్చు నంబుజేక్షుఁ డనుచున్. 25

క. యత్నము సఫలం బయిన స,
పత్నసమూహములు బెగడఁ బద్మాక్షుండా
రత్నముతోఁ గన్యాజన
రత్నముతోఁ బురికివచ్చె రయమున నంతన్. 26

క. మృతుఁడైనవాఁడు పునరా
గతుఁడై నక్రియం దలంచి కన్యామణి సం
యుతుఁడై వచ్చిన హరిఁ గని
వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్. 27

వ. ఇట్లు హరి తనపరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చిన నతండును సిగ్గువడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిం జని. 28

క. పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షుని పైఁ
బాపము గలదని నొడివిన
పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే. 29

మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే
సితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీదేహముఁ గాల్పనే దురిత మేమార్గంబునం బాయు నే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్ గారుణ్యభావంబునన్. 30

గీ. మణియుఁ గూఁతు నిచ్చి మాధవుపదముల
పట్టుకొంటినేని బ్రతుకు గలదు
సంతసించు నతఁడు సదుపాయ మగు నిది
సత్య మితరవృత్తిఁ జక్కఁబడదు. 31

మ. అని యిబ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతిగని సత్రాజిత్తు సంప్రాప్తశో
భనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్. 32

ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెండ్లియాడె నా
నామనుజేంద్రవందిత గుణస్థితి లక్షణ సత్యభామ ను

ద్రాముపతివ్రతాశ్వ సయుధర్మవిచక్షణతాదయాయశః
కాముని సత్యభామను ముఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్. 33

క. మణి యిచ్చినాఁడు వాసర
మణి నీకును నాకుఁ గలవు మణులు; కుమారీ
మణి చాలు నంచుఁ గృష్ణుఁడు
మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్. 34

---

## దుస్సహవియోగము.

కంకంటి పాపరాజు.

[కంకంటిపాపరాజు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు నెల్లూరుమండలవాసి; విష్ణుమాయావిలాసమను యక్షగానమును రచించి పిమ్మట ఉత్తరరామాయణమను ప్రబంధమును క్రీ. శ. 1790 ప్రాంతమున వ్రాసెను. ఈ గ్రంథరచనయం దీతనికిఁ బుష్పగిరి తిమ్మన తోడ్పడెను.

పాఠ్యభాగము ఉత్తరరామాయణములోనిది. రామునాజ్ఞను శిరసావహించి లక్ష్మణుఁడు సీత నడవిలో దించి రామాజ్ఞను దెలుపును. పిమ్మట సీత విచారపడును.]

చ. అడలకు మన్న నీకు వసుధాధిపు నానతి దాఁటవచ్చునే
యిడుములఁ జెందు మంచు విధి యీధర నన్ను సృజించి యుండఁగాఁ
గడవఁగ నెవ్వరోపుదురు కానల కేగిన నాఁడె యాపదల్
గడచితి నంచు నుంటి నెఱుఁగం దుది నిట్లగు నంచు నామదిన్. 1

క. ఆ దుర్నిమిత్తముల ఫల
మీ దుఃఖము సేయకున్నె యీ దుఃఖము లా
పాదింప విధి తలంచియొ
కాదే యాకోర్కె నాకుఁ గలిగించుటయున్. 2

చ. ఎడపక పూర్వజన్మముల నే మిథునంబులఁ బాయఁజేసి వా
రడలఁగ నవ్వుచుంటినొ? యా యఘ మూరకపోనె? నాఁడు కా
ఱడవుల రామపాదజలజాప్తి వసించితి; నేఁడు నాకు పొం
దెడసి యనాథనై యిచట నేగతి మేన భరింతుఁ బ్రాణముల్. 3

ఆ. ఏను సాధ్వి ననుచు నెల్లవారలు నన్ను
సన్నుతింతు రనుచు సంతసింతుఁ
గాని నడుమ నిట్టి కటికినిందలు పుట్టి
యడవిఁ ద్రోచు రాముఁ డనియెఱుఁగ. 4

చ. కటకట! లక్ష్మణా! పిడుగుకంటెను బెట్టిద మైనమాట నేఁ
డిటు వినియుండియుం బగుల దింతలు సింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీకటికబావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన నాపద లొందఁగ నున్నదాననో? 5

చ. కళవళ మంది తెల్పితివొ కాక పరాకునఁ దప్పవింటివో
కలనయినన్ రఘూద్వహుఁడు కానలలో ననుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ మతిభ్రమమైనదొ హా సహింపు మి
ప్పలుకు లెఱుంగకంటి వెతఁబాటిలె నీకొక భ్రాంతి యున్నదే? 6

ఉ. ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును సన్నిఁక రామచంద్రుఁడుం
గన్నులఁ జూడఁ గల్గదొకొ కల్గకయుండినఁ బ్రాణమేల పో
దన్న రఘుప్రవీరు చెవు లారఁగ నింతయుఁ దెల్పు నాదుమే
నున్నది చెంత గంగమడుఁగున్నది మైనటు లయ్యెడుం దుదిన్. 7

చ. పతి మతి నెంచెనేమొ తనుఁబాసి యశోకవనంబులోపలం
బ్రతుకదె? పెక్కునాళ్ళనుచుఁ గ్రమ్మఱఁ దాఁ జనుదెంచి శత్రునిన్
హతునిగఁ జేయు నేలు నను నాసగదా బ్రతికించె నాఁటి కా
గతి నిఁక నేమి యాసగొని కాయము నిల్పుదుఁ దెల్పు మిన్నియున్.

చ. ఎఱుఁగనిమూఢు లాడుకొను నెగ్గులకున్ భయ మంది యప్పుడే
కఱకుమనంబుతో విభుఁడు కానన సీమకుఁ బంచెఁగాక యా

త్తెఱఁ గొకసారి నన్ బిలిచి తెల్పి మనోవ్యథ తీర్చి నిన్ను నే
మఱ నని పంపఁ డయ్యె నభిమానముఁ గూర్మియు నెందుఁ బోయెనో

క. ఆకరుణ యాప్రసన్నత
యాకూరిమి యాప్రియోక్తి యాగారవముం
గాకుత్స్థుఁడు మఱచెఁగదా
యాకస్మికముగ జనించు నపవాదమునన్. 10

శా. ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వశో
భాకీర్ణాంచితగల్లమై సురదనంబై సుందరభ్రూయుతం
బై కమ్రస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరాముమో
మాకాయంబునఁ జూచుభాగ్య మిఁక లేదేమో సుమిత్రాత్మజా! 11

సీ. అవని నయోనిజనయి పుట్టి మిథిలేంద్రు
పీట నేఁ బెరిగిన విధము వినరో?
యంగరాగము లిచ్చి యనసూయ మొదలైన
సతు లెంచుకొన్నది చాలవినరో?
యాలంకలోఁ దొల్లి త్రైలోక్యము నుతింప
వహ్ని నేఁ జొచ్చిన వార్త వినరో?
యీసీత నిర్దోషి యేలుకొమ్మని రాము
బ్రహ్మాదు లపుడన్న పలుకు వినరో?

ఆ. వినియుఁ గనియుఁ బ్రజలు నను నిందసేసిన
యంతమాత్రమునకె యధిపుఁ డులికి
యింత తెగువ సేయ నిచ్ఛగించుట నా య
భాగ్య మింతె యొకరిఁ బల్క నేల? 12

చ. వనముల కేల వచ్చితివి వల్లభునిం బెడఁబాసి యొంటిగా
నని మునిపత్ను లెల్ల గుమియై యడుగన్ ధృతిమాలి వారి కే
మని వివరింతు నింత విపదంబుధి నేకరణిం దరింతు నే
యనువున నీ ప్రతిక్షణమహాయుగముల్ క్రమియింతు లక్ష్మణా! 13

వ. అని పెక్కువగల నమ్మగువ వాఁగిలి మగనితెగువకుఁ బరిత
పించియు నింతుక తగవు దలంచి తెగువవహించి బహిర్లిఖితచిత్రంబు
కొమ నొందియున్న యమ్మఱందితో మఱియు నిట్లనియె. 14

చ. వేగమునఁ దోఁచినన్నియు విచారణఁ బల్కితిఁ గాక భర్తకున్
జగదపవాదముం గనువశక్యమె? నేను వియోగమగ్నతం
దెగువకుఁ జొచ్చి రాము జననిందితుఁ జేయుదునే? తదాజ్ఞ యె
ల్లగతులఁ బూని కానల మెలంగెద మేనుగలంతకాలమున్. 15

సీ. అన్న లక్ష్మణ యింక నాలస్య మేటికిఁ
జను మయోధ్యాపురంబునకు నీవు
మువ్వురత్తలకును మ్రొక్కితినని తెల్పు
మచటి బంధుల నెల్ల నడిగితి నను
మతికృపాళునకు రామావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కు మీవు
దనయాజ్ఞఁ దలఁ దాల్చి జననింద తనుఁ జెంద
నీక కానలఁ జరియింతు ననుము

తే. భూజనుల బాంధవుల లెస్స బ్రోవుమనుము
తలఁప నాకేడుగడయును దానె యనుము
భావ మెప్పుడుఁ దనమూర్తిఁ బాయదనుము
నెమ్మి నొకయింత నామీఁద నిల్పుమనుము. 16

తే. పోయిరమ్ము శుభంబులు పొందు నిన్ను
నన్ను మఱవక యుండుమా యన్న యనుచుఁ
గన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగ
నన్నెలంతుక దీనయై యడలుచుండె. 17



# సుభాషితములు.

[భర్తృహరి యనుకతఁడు నీతిశృంగారవైరాగ్య శతకములను మూఁడుభాగములు గల 'సుభాషితత్రిశతి' యను గ్రంథమును సంస్కృతమున రచించెను. దీనిని తెనుఁగున ఏనుఁగు లక్ష్మణకవి, మహామహోపాధ్యాయుఁడైన ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మకవి యను మువ్వురు వేర్వేఱుగ రచించిరి.

ఈ క్రింది పద్యములు నీతిశతకమునందలి పది పద్ధతులనుండి గ్రహింపఁబడినవి. వివరములకు లఘుటిప్పణమును జూచునది.]

చ. మకరముఖాంతరస్థమగు మానికమున్ బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికరమైన మహోదధి దాఁట వచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె సర్పము నైన భరింపవచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజనచిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్ 1

ఉ. విద్య నిగూఢగుప్తమగువిత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు, విదేశబంధుఁడున్,
విద్య విశిష్టదైవతము, విద్యకు సాటి ధనంబు లేదిలన్,
విద్య నృపాలపూజితము, విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే. 2

క. విదళింప నుఱుకుసింగపుఁ
గొదమయు మదమలినగండకుంజరములపై,
నిది బలశాలికి నైజము
గద, తేజోనిధికి వయసు కారణ మగునే? 3

క. ఏనరునకు విత్తము గల
దానరుఁడు కులీనుఁ, డధికుఁ, డార్యుఁ డతండే
ధీనిధి, ధన్యుఁడు, నేర్పరి,
నానాగుణగణము కాంచనంబున నిలుచున్, 4

మ. బహువిద్యావిదుఁ డయ్యు దుష్టజనుఁ డెప్పాటన్వివర్జ్యుండు గా
నిహితుం జేసి కొనందగండు ఫణి మాణిక్యోజ్జ్వలం బయ్యు న
య్యహి సంత్యాజ్యమె కాని చేకొనఁగ నర్హంబే? విభాస్వద్దయా
లహరీనిర్ఝరిణీశ్వరా! సురభిమల్లా నీతివాచస్పతీ. 5

శా. ఆపత్తిన్ధృతి సంపదన్క్షమ శ్రుతి న్వ్యాసక్తి సద్గోష్ఠి హా
చాపాండిత్యము, పోరవిక్రమము భాస్వత్కీర్తిపై వాంఛయున్,
రూపింప న్మహనీయు లౌజనుల కెందున్లక్షణంబు ల్సుమీ,
యాపూర్ణప్రతిభానిధీ! సురభిమల్లా నీతివాచస్పతీ. 6

మ. జలజాతంబులు వేఁడెనే రవి వికాసం బొందఁగాఁ జేయుఁ గ
ల్వలు ప్రార్థించెనె చందమామయను వేలం బొప్ప రంజించు లో
కులు లంచంబిడి రేతజిన్జలము మేఘుం డిచ్చుఁ బుణ్యాత్మకుల్
దలఁప న్స్వాన్యహితక్రియ ల్సురభిమల్లా! నీతివాచస్పతీ! 7

చ. అమరులు వార్ధిఁ ద్రిచ్చునెడ నందుదయించిన రత్నపాళి హా
ర్షము గన రాహలాహలవిషంబున భీతి వహింప రాత్మన
య్యమృతముఁ గన్నదాఁక విడరప్పని యే తెఱఁగైన ధీరస
త్త్ములు సునిశ్చితార్థ మవుదాఁక ప్రయత్నము మాననేర్తురే. 8

ఉ. లేవడి పొందియున్ వెతల లీనతఁ బొందియు లేచు గ్రిక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదారతఁ గందుకవృత్తి హత్తి దు
ర్భావుఁడు తద్విధంబున విపద్దశ వచ్చిన నొచ్చి నాశిలున్
లేవక మంటిముద్ద ధరణిం బడి యట్లె యణంగుకై వడిన్.

చ. సురచితకర్మము న్నపుడు సున్నపుమిద్దెలు చిన్నపాయపుం
డెఱవలు తెల్లనౌ గొడుగునీడల హెచ్చులు లచ్చియున్నిరం
తరమయి నట్టలుండు నది తప్పిన నెంతయుఁ గంతునంగరాం
తరహతతంతు వౌక్తికవితానగతిన్ వితతమై వడిన్ జెడున్ 10



## మధుకలశము.

రాయప్రోలు సుబ్బారావు.

[శ్రీయుత రాయప్రోలు సుబ్బారావుగారు ఉస్మానియా విద్యాపీఠమునందు ప్రధానాంధ్రోపన్యాసకులు. వీరు తృణకంకణము, జడకుచ్చులు, రమ్యాలోకము, మధుకలశము మున్నగు రసవత్తర కావ్యములను రచించిరి. శైలియందును, భావ ప్రకటనమునందును వీరిది అందెవేసినచేయి.

ఫిట్స్‌జెరాల్డు అను ఆంగ్లకవి పారసీకభాషనుండి ఉమర్ కావ్యమును ఆంగ్లమున అనువదించెను. దీనిననుసరించి వీరు మధుకలశమను పేర ఆంధ్రమున రచించిరి. ఈక్రిందివి దానిలోనుండి యుద్ధృతములు.]

ఉ. రేలుబవల్ కవాటములరెక్కలుగాగల ఈయెడారిస
త్రాలకు వచ్చుచుంద్రు సులతానులు లోకం డెడలన్ మఱొక్కడాం
దోళిక లెక్కి; ప్రాభవముతో వసియింతురు రెండుమూడునా,
ళ్ళోలగ మాపి యంత నెటకో విరమింతురు, కంటె, నెచ్చెలీ! 1

చ. గతదివసప్రపీడనయు గాఢభవిష్యదపోహభీతియున్
హత మొనరింపజాలు మధు వందప్రగిన్నియ నిండ నింపు; మీ
వితమున రేపు రేపని తపించెద వగ్మలి; యెన్ని రేపు లీ
క్షితిపయి 'నిన్న'లందు గలసెన్ గతకాలమయాబ్దరాశిలోన్. 2

చ. కలికెడు క్రొత్తశోభనపుకోకలు తాలిచి గ్రీష్మదూతి; న
వ్వులతిరునాళ్ళలోన తెనివోముగ దే మనమిందు, ముందు రా
గిలిన ప్రియుల్ గతించిరి సఖీ! మన మేమె యింక భూమిక్రిం
దల బవళింప; నెవ్వరికొ తల్పముగాదుముగామె మావలన్. 3

చ. మనమును మంటిక్రిందబడి మాయకపూర్వమె లబ్ధమైనదా
ని ననుభవింపజెల్లు తరుణీ! యటుపిమ్మట ధూళి ధూళితో
నెనసి యణంగిపోవు, మధు వెందును పిమ్మట గానమా గను, గా
యనులును నిద్రవోదురు లయశ్రుతులున్ చెవికంద వాపయిన్. 4

శా. ఆవేదాంతుల శుష్కతర్కముల వ్యాఖ్యానింపగానిమ్ము, నీ
వీవృద్ధున్ సుఖపెట్ట రమ్ము సకియా! యేకాంతపున్ సేవ; ప

పూవుల్ విచ్చు శుభప్రభాతముల నాపూర్ణిమ్నియున్ రాలు సం
ధ్యావేళన్, నిజ మిద్ది తక్కినది మిథ్యావాద మింకేటికిన్. 5

ఉ. నేనును బాల్యమం దధికనిష్ఠమెయిన్ గురుపాదసన్నిధిన్
మానుగ నాలకించితి బ్రమాణములైన పరేంగితార్థముల్,
కాని; నిజాన నెప్పుడును కన్నులు విప్పక బైట వచ్చితిన్,
పూనిక వీడి లోపలికి బోయిన వాకిటనే సఖీమణీ! 6

ఉ. ఏమిపనో యెఱుంగక మహిం బడితిన్, ప్రవహించుచుంటి నే
భూముల నింకనో జలముపోల్కి ననిష్టమొ! యిష్టమో సఖీ!
ఈమధువాటికన్ విడిచి యేదెసకో సుడివోదు చోటి యా
సీమల వీచుగాడుపులచే, మది నచ్చిన నచ్చకుండినన్. 7

చ. ప్రమదరో! 'నేతి నేతి' యని పారము కానగరాని ఈవివా
దముల నలంగు డెందనుక? ధారలుధారలుగా స్రవించు తి
య్యముగల ద్రాక్షతో పరవశాదరయోగము మేలుకాదొ, శూ
న్యమొ అటుగాక చేదొ అగు అందనిపండులకంటె నెప్పుడున్. 8

ఉ. ప్రాణి జగాన కెల్ల బరమావధియౌ అల శూన్యమందె యీ
శోణమరందమున్ తదభిచుంబనరక్తిమగ్రిక్క మోవియున్
లీనము కానయేని? గమనింపుము కాగల కారణార్థమో
మానదు, వర్తమానపరిమాణము నాగదుగాదె నెచ్చెలీ! 9

చ. ఒకచదరంగపాళి యిది యుగ్మలి! రంగులగళ్ళు రేల్బవల్;
సకలజగజ్జనంబులను సారెలుగా గొని కాలు డాడు; పా
చికలును కొంతనే పనుగు చెల్లి నటించి, యొకింతలోన మా
రకులయి యీవలావల పరస్పరమున్ తెగి పేటికం బడున్. 10



పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వేంకటేశ్వరరావు.

# ధర్మోపదేశము.

[మ॥ రా॥ శ్రీ. పింగళి లక్ష్మీకాంతము పంతులు ఎం ఏ గారు ఆంధ్రవిద్యాపీఠమునఁ ప్రధానాంధ్రోపన్యాసకులు. వీరును, ప్రకృతము బందరునందు ఆంధ్రజాతీయ కలాశాలా ప్రధానాచార్యులునగు మ॥ రా॥ శ్రీ. కాటూరి వేంకటేశ్వరరావుగారును కలిసి యీ సౌందరనందకృతి రచించిరి. దీనిని తమగురువర్యులగు బ్రహ్మశ్రీ. శతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి అంకితమొసర్చి కృతకృత్యులైరి.

పాఠ్యభాగము సౌందరనందము షష్ఠసర్గములోనుండి సంగ్రహింపఁబడినది. నందుఁడు బుద్ధుని సవతితమ్ముఁడు. ఒకనాఁడు బుద్ధుఁడీతనిని భిక్షువుగఁజేయించెను. మనస్సులో బౌద్ధదీక్షయందిష్టములేని తమ్మునికిట్లు బుద్ధదేవుఁడు బోధించెను.]

శా. పాఱన్ జూడుము! శోకమోహభయసంభ్రాంతమ్ము విస్తారసం
సారారణ్యమునన్ దెసల్ దెలియ కాశాబద్ధమై సారెకున్
గ్రూరత్వమ్మున నొండొరున్ గసిమసంగున్ బ్రాణిలోకమ్ము హిం
సారంభమ్ము వినా, సుఖం బెటుల లభ్యంబౌ నిటన్ దేహికిన్? 1

మ. భరమౌ నాఁకటి పెల్లునన్ బులి నిజాపత్యమ్ము భక్షింప, సూ
నరులై యీనరు లెల్లవారు పరసంతానమ్ము భక్షింతు, రీ
పరహింసారతమౌ జగమ్ము ననుకంపాదృష్టి రక్షింప నెం
తురుగాని, మనకేమి యన్నటులఁ బ్రొద్దుల్ పుత్తురా రాసుతుల్? 2

క. ప్రాసాదోపరితలముల
దాసీజనకల్ప్యమానతత్తద్భోగో
ల్లాసలసితాత్ములెల్ల ద
యాసారవిదూరులో? మహాంధులో? తనయా! 3

ఉ. కానలఁ బచ్చికల్ దిని మృగమ్ములు గ్రుక్కెఁడు నీరు గ్రోలి ప్రా
ణానిలముల్ ధరించుకొనవా, నరు లెంతటి జాల్ములో కదే!
జేనెడు పొట్టకై దురితసింధువునం బడి సృష్టియెల్ల దుః
ఖాన మునుంగఁజేసి నరకప్రతిమాన మొనర్తు రక్కటా! 4

ఉ. ఆఁకలిబాధచేఁ జెమట లాఱని గాసికి నోర్చి, ప్రాణముల్
పోకడపెట్టువారి శ్రమముల్ రుధిరమ్ము గడించి యీయఁగాఁ
జేకుఱినట్టి యర్థము లిసీ యని రోయ కెటుల్ భుజింతు వ
న్నా! కృపమాలి, ఘోరకలుషాక్తతఁ దుచ్ఛములైన భోగముల్.

ఉ. వ్రేఁగయినట్టి వేదనలపెల్లున మున్నె కుసుళ్లుగూలి, య
య్యో! గడికాళ్లు వైచికొనియుండొటిఁ దాఁచుచుఁ గ్రుమ్ములాడునీ
లేఁగలవంటి లోకుల మలీమసభావముఁ బాపి ప్రోతురా,
రాగిలి భోగముల్ గుడుతురా? నినువంటి నరేంద్రపుత్రికుల్. 6

ఉ. సారథికృత్య మొక్కరుఁడు, సైంధవకృత్యము వేఱొకండు శాం
తారభటిన్ యథావిధి నుపాయముమై నెఱవేర్చి లోకయా
త్రారథమున్ మునీంద్రవిహితమ్మగు గమ్యము చేర్చుకోసమై
పాఱుని జన్మమున్, బుడమిపాలుని జన్మముఁ గల్గెనిమ్మహిన్. 7

గీ. బరువు మోయఁగఁజాలు నశ్వములు లేక
ప్రాప్యము నెఱింగి నడపు సారథియు లేక
దారి తప్పెను నేఁటికి నారథమ్ము;
ఎచటఁ బడి కూలిపోవునో యెఱుఁగరాదు. 8

గీ. స్వర్గఫలకాంక్ష రాజ్యవిస్తారకాంక్ష
జన్నము లటంచు సంగ్రామసరణు లెంచు
జనులు కురియించు రక్తవర్షమ్ముకతనఁ
దడియుచున్నది భూదేవితనువు కుఱ్ఱ! 9

గీ. పొదుగుఁ విడువని పిల్లపై బుద్ధిపాఱి
యడలునన్ దల్లిమేఁక సూనాంగణమున
రాల్చు కన్నీటిబొ ట్లంకురములుగాఁగ
మొలచుచున్నవి విషవృక్షములు కుమార! 10

గీ. ఆద్యులైనట్టి ఋషులు సత్యం బహింస
ధర్మదేవత రెండు నేత్రము లటంచుఁ

గఱపిపోయిరి లోకసంగ్రహము కొఱకు;
సాధురాలయి యాపె యల్లాడు నిపుడు. 11

గీ. ఊబిలోఁ గాల్లు దిగఁబడి, యోరమెడను
మలఁచి, బఱచు లాలకించు గోమాతవోలెఁ
దల్లడిల్లుచున్న దీవిశ్వధాత్రి, రాచ
బిడ్డనికి నీకుఁ దగునె యుపేక్ష సేయ? 12

సీ. నకనకలాడు పొట్టకు నింత గంజియే
నోదవని సిరుపేద యుమ్మలికయు
వేఁకియెత్తిన మందు మాఁకు పథ్యము పాన
మరయువారలు లేని యనద మూల్గు
అస్త్రజర్జరితాంగులై రణక్షోణి ది
క్కఱి యేడ్చువారి యాహారవమ్ము
పతివియోగం బేకసుతవియోగము జత
యై పొక్క నిర్భాగ్యురాలి కూయి

గీ. అంధపంగ్వాదులగు వికలాంగులెల్ల
సలుపు గగ్గోలు నేకమై జగతి, శోక
భీకరమహాంబునిధియాచు, విరతిలేక
యడలుచుండఁగఁ జెవిఁదూఱదా, కుమార! 13

సీ. ఆఁకలిసెకకుఁ గాయమున మాంసాదులు
హరియించిపోవ శల్యములు మిగిలి
పొలుసెత్తి, పాలి, కన్నులగుంటలు లేర్పడి,
బోర యుండఁగ, బొజ్జ బూరటిల్లఁ
బుడకకాళులతోడ నడయాడు చిల్లనఁ
బెరటిలోనికి నేగి బిడ్డఁ డచట
మంటిపెళ్లలు దినుచుంట గన్గొనియును
వలదని వారింప బాకురాక

గీ. కుత్తుకల నల్లపూసయుఁ గుండలోన
వడ్లగింజయుఁ, గనుల బాష్పములు లేక

కడుపు చుమ్మలు చుట్టఁగా నడలుచున్న
తల్లులం గాంచవో నీవు తమ్ముఁగుఱ్ఱ? 14

మ. అవియుః గుండెలు రాతికైనఁ గనుమన్నా! విశ్వదైన్యమ్ము, చా
లవు నీకొర్పట్టఁగ వేయికన్నులు, భుజాలక్షల్ నలేక బాపకూ
పవిపన్నాత్మల నుద్ధరింప, వెతఁబాపఁగ, సేదఁబోకార్ప, నై
నివ్వరఁగ బాష్పజలమ్ముఁ బోఁదుమువఁ గండీ! లెమ్ము సజ్జండవై.



# భారతవీరుఁడు.

జాషువాకవి.

[వీరు గుంటూరు మండలములోని వినుకొండ హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగఁ బనిచేయుచున్నారు. ఫిరదౌసి, స్వప్నకథ, ఖండకావ్యము రెండుభాగములను రచించిరి. మృదుమధురమైన వీరి శైలి సమకాలీనుల యాదరణకు గుఱియైనది.

పాఠ్యభాగము వీరిఖండకావ్య ప్రథమసంపుటమునుండి యుద్ధృతము.]

గీ. ఘనకురుక్షేత్ర సంగ్రామ గగనమునకు
భానుమంతుఁడవై, వైరివర్గములను
కలఁచి గెలిచినదండిమగండవీవు
కర్ణ! కారణమేమి? దుఃఖపడనింక. 1

గీ. సమరధర్మంబు విడి ధనంజయుఁడు సంపె
నతనిచేఁ జచ్చె రాధేయుఁ డనెడుపల్కు
పుట్టినను చింతకలదు కాఁబోలు నీకు
నట్లు కాదయ్యా! గెలుపు నీయదియె కర్ణ! 2

గీ. ధర్మముఁదలంచి నినుఁగన్న తల్లినసుఁగు
సోదరుల రేణువులభాతిఁ జూచినాఁడ

వారా! నీస్వామిభక్తి నీయద్వితీయ
సుగుణసంపద వర్ణింప నగునె కర్ణ! 3

శా. వీరాగ్రేసర! నీవుపాండవబలాబ్ధిన్ మందరంబట్లు దో
స్సారంబారమథించి యంచితయశస్సారంబు లోకంబునన్
బారం జల్లిన సద్ధనుర్ధరుఁడ వెవ్వాఁడీకురాసీకుఁ? గ
ర్ణా! రాజన్యుల కెల్ల నీచరిత మన్నన్ గర్ణపేయంబగున్. 4

శా. కింకన్ రుద్రునిఁబోలి తేరినడుచక్కింజేరి ధృష్యద్ధను
ష్టంకారం బొనరించుచున్ విమతకంఠశ్రేణిఁ జెండాడు, నీ
వంకన్ జూడఁ గిరీటి యంతటి ప్రతాపస్ఫారమార్తాండుఁడే
జంకె, న్నీ కెనురెక్కవీరుఁ డొకఁడు జన్మించునే? భానుజా! 5

మ. జననం బందిన తత్క్షణంబ, కఠినస్వాంతంబునన్ గంగక
ప్పనగావించినకూరురాలనక, లోభస్వాంతయై కుంతి, నా
యన! కర్ణా! సుతభిక్షురా యనఁగ నాహా! మారుమాటాడకి
చ్చిన విఖ్యాతవదాన్యమాన్యుఁడవు పోచ్చెం బేది? నీకీర్తికిన్! 6

చ. అరదము గ్రుంగి పోయినప్పుడైనను భార్గవరాముశాపవా
క్స్మరణి, శరంబులూహకెడ సన్నపుడేనియు, శల్యుఁడెన్నిని
ష్ఠురములువల్కుచున్న రణశూరతదక్కక వైరివీరకం
ధరపటుకర్తనోద్యమమునం జెలువార వె! సూర్యనందనా! 7

మ. ఒకపాంచాలికి భర్తలేవురని మర్త్యుల్ గూడిమాటాడు వా
డుకయే కర్ణకఠోరమై మసలుచుండున్ డెందమందట్టివా
నికి నాకాజవభర్తనామము ధర న్నిర్మింపకంచు న్మురా
రికి వాక్రిచ్చి, యశంబుఁ జాటవె? ధరిత్రీమండలిన్ భానుజా! 8

గీ. పార్థనామంబు చెవిలోనఁ బడినయంత
భగ్గు మని మండిపోవు నాపాదమస్త
కంబు నీకట్టి మీఁవైర కారణంబు
చాటుచున్నది కర్ణ! నీస్వామిభక్తి. 9

ఉ. చండగభస్తిమండల మొసంగిన నాతొలిచూలి కాన్పు క
ర్ణుండను, కుంతిమాటకు తనూలతకంపమునంద ధర్మసూ
నుండెలుఁగెత్తి యేడిచి నినుం గొనియాడుచుఁ బల్కె "నట్టిశూ
రుండిఁక పుట్టఁబోఁడ" ని, నిరూపణ చేయుచు సూర్యనందనా! 10

మ. చెవుల న్గుండలముల్ పరిభావిభవరాజిన్ జిమ్మ వర్మంబుఁ బు
ట్టువుతోఁ గల్గిన ముద్దుబిడ్డఁడవు నీటుం గోటు దీపింప రెం
డవమీనాంకుఁడు వోలి విల్లుగొని జన్యక్షోణులం జొచ్చి శా
త్రవనాశంబొనరించు నిన్నుఁగని కర్ణా! కుంతియెట్లోర్చెనో! 11

చ. మిత్రులఁ బవిత్రవంత మయి మేదినిఁ గాలువ గట్టి మర్మరా
రవము సెలంగ నీదు రుధిరంబు స్రవించుచు "అర్జునా! యధ
ర్మవు భవ" మంచు నెంతవలపోసెనొ, శత్రుకళేబరంబులం
టవలసెనంచు నెంతవనటం బడినాఁడవొ, కర్ణ! కూలుచోన్. 12

చ. నరుఁడు బృహన్నలాఖ్య నలనాఁడు విరాటుని గొల్చుచుండి యు
త్తరునకు సాయమై కురుశతంబును మూర్ఛలఁ గొట్టునాఁడు భా
స్కరసుతుఁ డోడెనందురని కన్నుల నీరిడకయ్య! శక్తులై
గురుఁడు నదీసుతుం డెదురుకొన్నది లేదుగదయ్య భానుజా! 13



# అమర్షము.

నందితిమ్మన.

[నందితిమ్మన శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవి. తన పారిజాతాపహరణమును కృష్ణరాయని కంకితమిచ్చెను. అందుచే నితఁడు క్రీ శ 1500 తరువాత నివసించెనని తేలుచున్నది. ఇతఁడార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; శివభక్తుఁడు. ఇతనికవిత ముద్దుఁబల్కులకు ప్రసిద్ధి.

పాఠ్యభాగము పారిజాతాపహరణము ప్రథమాశ్వాసమునుండి యుద్ధృతము. నారదుఁడు రుక్మిణికిఁ బారిజాతకుసుమమిచ్చెనమ్మ యని యొక చెలివచ్చి సత్యభామకిట్లు చెప్పెను.]

క. అమ్మా! యేమని చెప్పుదు
నెమ్మి న్నీవిభుఁడు రుక్మిణీసతిమణి సౌ
ధమ్మున నుండఁగ సురముని
క్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చటికిన్. 1

క. చనుదెంచి యమ్మురారికి
ననఘం బమరైకయోగ్య మతిసౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్క దివ్యకుసుమ మొసఁగెన్. 2

క. మిన్నంద వేగఁగయికొని
కన్నులనొత్తికొని ప్రియుక్కి గౌరవమొసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెన్
సన్నలఁతియుఁ గొప్పులోన నవ్విరిదాల్చెన్. 3

ఉ. ఆకుసుమంబు దాల్చిన మహామహిమంబునఁ దోడికామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొలంగి భజించుచుండ న
స్తోకనిజప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకము దాన నేలుఁగతి లోలవిలోచన యేమి సెప్పుదున్. 4

ఉ. ఎంతకు లేదు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చి దాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతున వచ్చుసత్యగరువం బికఁ జెల్లదటంచు మానినీ. 5

చ. అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చినకనుదోయికెంపు దనచెక్కులఁ గుంకుమపత్త్రిభంగ సం
జనితనవీనకాంతి వెదచల్లఁగ గద్గదఖిన్నకంఠి యై. 6

శా. ఏ మేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాట ల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డే మే మాడెను రుక్మిణీసతియు నీ వింకేటికిన్ దాఁచెదే
నీమోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే. 7

చ. అతులమహానుభావ ముని యవ్విరిఁ దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ జేసినఁ జేసెఁగాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్. 8

క. పలుదెఱఁగుముళ్ళమాటలు
కలహామెకల్యాణమని జగంబులవెంటన్
మెలఁగెడుమౌనికి సహజము
వలదనివారింపవలదె వల్లభుఁడతనిన్. 9

క. మునియేమి సేయు?, రుక్మిణి
గొనఁగారణ మేమి? ధూర్తగోపాలుఁడు సే
సినచెయిదమేమిచెప్పెడు
మనమెరియదె ప్రాణమైన మగఁడిట్లయినన్. 10

క. పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగదంద్రుమదిన్
శరదంబుదచలచిత్తులు
పురుషులెపో వారి నమ్మఁబోలునె చెలియా! 11

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱలోఁ గడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యా

వన్నెయు వాసియుం దఱిఁగి వారు ననుం దలలెత్తి చూడఁగా
నన్నులఁ జాయలం బలుక నైతును బ్రాణము లింతతీపొకో! 12

ఉ. నామొగమోటకై వలసి నాటకముల్ ఘటియించె రుక్మిణీ
కామిని మీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గాన నీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో
తామరసాక్షి! మెచ్చనలదా మురదానవభేదికృత్యముల్. 13

ఉ. ఓచెలి! శౌరి కిచ్చెనఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డాచపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్విరి యిట్టిమాట లా
హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మియి నున్నదాననో. 14

క. పూనుకొన మేలుగీళ్ళకు
లోనయి విహరించువారిలోక మెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
దానెఱుఁగడొ భోజకన్య తానెఱుఁగదొకో! 15

ఉ. ఆసరసీరుహాక్షినిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం
జేసి యొసంగెఁబో తగవు సేకొని యొక్కలతాంత మింతలో
వాసియు వన్నెయుం దగవు వైభవముం జలము న్వివేకముం
బోసవతు ల్భజించుటకుఁబో వెఱఁగయ్యెడు నేమిసెప్పుదున్. 16

క. కలకాల మొక్కగతిఁ బూ
నలలోదారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడు పురుషులు గలుగుట
తొలిజన్మము నోముఫలము తోయజనేత్రా. 17

క. పతి ప్రాణసద్వశబంధువు
పతి దైవం బేమగఁడయుఁ బతిసతులకున
పతియె కడుమేరదప్పిన
గతి కులకాంతలకు వేఱుగలదే చెప్పగా. 18

క. ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనముగ నోర్వంగవచ్చు మగఁడింతులకున్

జన విచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు చెలియా! 19

క. అని వగల మిగులనొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగిహరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్. 20

# చంద్రికా వర్ణనము.

[మొల్లరామాయణమునుండి యుద్ధృతము.]

ఉ. భానుసహస్రసత్కిరణ పంక్తుల నుద్భవ మైనయాబృహ
ద్భానుని వెట్టఁ బెల్లుడకఁ బడ్డసుధాంబుధిమీఁదిమీఁగడల్
పూని సమీరుచేఁ దెరలఁ బూర్వదిశం గనుపట్టు దానిపై
ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుఁగొండపైఁ దగన్. 1

చ. కుముదములుం జకోరములుఁ గోమలసస్యముఁ జంద్రకాంతముల్
రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసి జగంబు లుబ్బఁగాఁ
గమలములుం వియోగు లధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్
రమణఁ గలంగ వెన్నెల తిరంబుగఁ గాచె జగంబు లుబ్బఁగాన్. 2

ఉ. నారదు లైరి సన్మునులు నాకమహీజము లయ్యె భూజముల్
శారద లైరి భామినులు శంకరశైలము లయ్యె గోత్రముల్
పారద మయ్యె నీరధులు పన్నగనాయకు లయ్యె నాగముల్
వారిదవర్గ మెల్ల సితవర్ణము లయ్యెను బండువెన్నెలన్. 3

చ. కొడుకుదయించె నంచు లరి కోరి సుధాంబుధి మిన్ను ముట్టె న
ప్పుడు జగ మెల్లఁ గప్పె ననఁ బూర్ణత నొందెను సాంద్ర చంద్రికల్
పుడమికిఁ బాలవెల్లిగతిఁ బొల్పెసలారఁగఁ జంద్రుఁ డొప్పె న
య్యుడుపతి మేనిమచ్చయును నొప్పెఁ బయోనిధిపద్మనాభుఁడై. 4

# బదరికాశ్రమము.

[నాచనసోముని హరివంశములోనుండి గ్రహింపఁబడినది.]

సీ. పవనవేగ విశీర్ణ పాదపాగ్రంబుల
జడియకుండఁగఁ బట్టు సానుజములుఁ
బూజార్థనియమిత పుష్పవాటికలును
మధుకరంబులఁజోపు మర్కటములు
నవబృథస్నాన పర్యంత నిర్మలతకై
కాసారములఁ గాచు కాసరములు
నిజనిజోటజభాగ నీవారసీమలఁ
జొరక కావలియుండు సూకరములుఁ

ఆ. వె. గలిగి కంసవైరి కన్నులపండువై
చెలువుమిగిలెఁ బూర్ణకలశవిగళ
దాలవాలవారి హారి తన్మునిదారి
కాశ్రమంబు బదరికాశ్రమంబు. 1

# సూర్యాస్తమయవర్ణనము.

[యయాతిచరిత్ర ద్వితీయాశ్వాసమునుండి గ్రహింపఁబడినది.]

తే. సరగమిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగాఁగాల్చి బంగారుచుట్టువాలు
పదనువెట్టఁగఁ గ్రానిపోయి పట్టలేక
విడిచెననఁ బ్రొద్దు పడమటి కడలిమునిఁగె. 1

క. కడకడలి వేఁడి వెలుఁగను
జడదారి వడిన్మునుంగఁజని జేగుఱుప
చ్చడ మాఱఁగ బైఁదరినఁ
బడమట నెఱసంజనిండె బలుపుగ మఱియున్. 2

## ప్రణయార్ద్రగీతికలు.

వేదుల సత్యనారాయణశాస్త్రి.

[ బ్రహ్మశ్రీ. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ప్రస్తుతము పెద్దాపురము హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగ పనిచేయుచున్నారు. ఆరాధన, ముక్తావళి, దీపావళి మొదలగు గ్రంథములను రచించిరి. వీరి కవిత మిక్కిలి రసవంతమై 'జీవము'తో నిండి యుండును. ఈక్రిందివి వారి 'దీపావళి' నుండి యుద్ధృతములు.]

ఆవృత్తి.

గీ. ఆ ప్రశాంతనిశాజరఠాంతమందు
కలతనిద్దురలో కలల్ గాంచుచున్న
గౌతమీనది నామనోగతవిషాద
తనువు నంతయు తనలోన దాచుకొనియె. 1

గీ. ఆ నదీసైకతముల నాయనుంగుజాడ
చెరపివేయగ వెనువెంట సరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్ను మూసెను నాయూర్పుగాడ్పు లెల్ల. 2

గీ. చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగు విషయమ్ములను తటస్థముగ నా య
నంతగగనమ్మునం దుండి యరయుచుండు
తారలె మదశ్రుకణముల నేరుకొనియె. 3

గీ. నేనె మిగిలితి నీగౌతమీనదీప
విత్రగర్భమ్ములో మోత్రిత వెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ. 4

ఆశాగానము.

ఉ. ఏసడి లేక యీప్రకృతి యెల్ల నిశీథతమోనిబద్ధమై
నీ సుకుమారహస్తముల నిద్దురవోయెడుమానవేళ, నీ

వే సరిజేసి యీశిథిలవీణను బాడు మటంచు నాపయిన్
గోరెద వేల? తీగ తెగునో, శ్రుతి దప్పునో, పల్కదో ప్రభూ! 1

ఉ. మావులగుంపులందు మధుమాసములన్ వికసించు కోకిలా
రావముపోలె రాగమధురమ్ముగ వీణ నదింపఁజాల, నన్
బోనఁగ నిమ్ము; ప్రేమరసపూరితవిశ్వవిలీనగాన మీ
వే వినిపింతువేని సుఖియించెద నే నది యాలకించుచున్. 2

ఉ. ఏవిధినైనఁ బాడు మని యేమొ వచియింతువయేని ప్రేమమై
నీవె రచించి నాకుఁ గరుణించిన నీ ప్రణయార్ద్రగీతికల్
గావున, నావిశుష్కతగళమ్మున నీకరుణాసుధారస
శ్రీవిభవమ్ము నింపి మధురింపుము నే శ్రుతిగల్పి పాడెదన్. 3

ముక్తావళి.

ఉ. పూవులరోజులున్ గడచిపోయె, విషాదహిమావృతాంధకా
రావిల మయ్యె నీప్రకృతియంతయు. ఆకులపాటునొంది పూ
దీవలు నాదు లేయెడదతీరున మోడయిపోయె, నాటియా
జ్ఞావిధి స్వామి! నా కిపుడు జ్ఞప్తికివచ్చి భయమ్ము గొల్పెడిన్ 1

ఉ. ఈమధుమాసశోభ గతియింపకపూర్వమె పూలతోటలో
కోమలపుష్పముల్ వెదకి కోసి యమర్చిన ప్రేమదామమున్
నా మెడలోనె వేయు మనినా, వపు డొక్కసుమమ్మునైన నా
స్వామి! భవత్పదార్పణము సల్పగలేనయితిన్ విమూఢతన్. 2

ఉ. నావలె శుష్కజీవనమునన్ దురపిల్లెడి యీపవిత్రగో
దావరి పేదవడ్డనినదమ్ములతో శ్రుతిగల్పి ప్రేమరా
గానహదుఃఖగీతు లిపు డల్లుచు గ్రుచ్చుచునుంటి నొక్కము
క్తావళి నాపవిత్రనయనాంబుకణోజ్జ్వలమౌక్తికమ్ములన్. 3

ఉ. ఈసుకుమారమాల ధరియింపుము నీహృదయమునందె స్వా
మీ! సుముఖమ్ములై పరిణమించు మనోజ్ఞవసంతమాససం
ధ్యాసమయాంతరమ్ముల రవంత భవన్మధురానురాగని
శ్వాసపరీమళానిలపు స్పర్శసుఖమ్ము ననుగ్రహించుచున్. 4

## మేటిబంటు.

మల్లికార్జునభట్టు.

[భాస్కరరామాయణమును హుళక్కిభాస్కరుఁడును, మల్లికార్జునభట్టును, కుమారరుద్రదేవుఁడును, అయ్యలార్యుఁడును రచించిరి. పాఠ్యభాగము మల్లికార్జునభట్టురచించిన సుందరకాండమునుండి యుద్ధృతము. ఈకవి పదునాల్గవశతాబ్దాదియందుండెను. ఇతనిశైలి రసవంతముగానుండును. వీరభయానకవర్ణనములఁ జేయుటలో నీతనికితఁడేసాటి.

హనుమంతుఁడు సీతకు ఆనవాలిచ్చి, వనభంగముచేసి, కొందఱురాక్షసులను జంపుచుండును. అప్పుడు ఇంద్రజిత్తీతనిని బ్రహ్మాస్త్రముచే బంధింప రాక్షసులు రావణునికడకుఁ గొనివత్తురు.]

వ॥ రావణుం జూచి జగత్ప్రాణతనూభవుం డచ్చెరువందుచు నంతరంగంబున. 1

క. ఈరూపము నీఘనభుజ
సారము నీధృతియు నిట్టి సౌందర్యము వి
స్ఫారోదారగుణంబులు
నీరాక్షసవిభుని కౌర యిట్లొప్పెడునే. 2

క. పాతకవర్తియు రాక్షస
జాతుఁడుఁగా కుండెనేని శక్రాదిసుర
వ్రాతంబున కధిపతియై
యీతఁడు లోకంబు లెల్ల నేలం దగఁడే. 3

వ. అని విచారించువృక్షచరుని రోషతామ్రాక్షుం డగుచు నిరీక్షించి రాక్షసచక్రవర్తి ప్రహస్తున కిట్లనియె. 4

క. నిను నెవ్వఁడు పుత్తెంచెను,
వన మేటికిఁ జెఱిచి తీవు వడి రాక్షసభం
జన మేల సేసి తెవ్వఁడ
వని యడుగుము నావుడుం బ్రహస్తుం డతనిన్. 5

క. కనుఁగొని తేజము చూడఁగ
వనచరమాత్రుఁడవు గావు వచ్చినపని వం

చనసేయక భయ మందక
వినిపించిన నిన్ను వేగ విడిపింతుఁ దగన్. 6

క. సురవరుఁడో దండధరుఁడో
వరుణుఁడో ధనదుండో దైత్యవరుఁడో వి ష్ణు
పురి సొర దూతగఁ బంచిన
యురుబలుఁ డెవ్వండు నాకు నొప్పఁగఁ జెపుమా. 7

వ. అనినం బ్రహస్తున కనిలజుం డిట్లనియె. 8

క. హనుమన్నాముఁడ మారుత
తనయుఁడ రఘురాముదూతఁ దపనప్రియనం
దనునకు సచివుఁడ నిక్కపు
వనచరుఁడన్ సీత వెదక వచ్చితి నిటకున్. 9

క. దివిజారిదర్శనం బ
న్యవిధములన్ నాకు దొరక దని వనభంగం
బు వడిం జేసితిఁ జేసితి
బవరము నారక్షకాలకు బలములతోడన్. 10

చ. కరము విరించిచే వరము గాంచిననన్ను శరంబులన్ సురా
సురులకుఁ గట్టరా దవుటఁ జూ శరముక్తుఁడ నైతి లోకభీ
కరు దశకంఠు నొందుగతిఁ గాన నశక్యము గాన రాక్షసో
త్కరములచేతఁ గట్టువడి కన్గొను వేడుకతోడ వచ్చితిన్. 11

వ. అని పలికి రావణుం గనుంగొని. 12

క. ఇనజుఁడు సీతోఁబుట్టువు
నినుఁ గుశలం బడుగు మనియె నృపతియు రవినం
దనుఁడును నీకును బుద్ధులు
దనరంగాఁ జెప్పు మనిరి తగవున నీవున్. 13

వ. వినుము రామచంద్రుఁడు సీతాలక్ష్మణసమేతుండై తండ్రియానతి దండకావనవాసంబునకే తెంచి, యట ఖరదూషణాదులఁ దునిమి, పత్నిం

గోల్పోయి, యెల్లదిక్కుల వెదకుచు, ఋశ్యమూకంబున సుగ్రీవుతోడ సఖ్యంబుచేసి, సీతాన్వేషణంబునకై నన్నుఁబంప నేనును రాఘవ సుగ్రీవుల యానతి సముద్రం బవలీల దాఁటి లంకాపురి సొత్తెంచి యంతట వెదకి యయ్యశోకవనికామధ్యంబున నున్న జనకరాజనందనం గాంచితి ధర్మవిరుద్ధంబును గులనాశకంబు నగుపరదారాపహరణంబు నీయట్టిబుద్ధిమంతులు గావింతురె ధర్మశీలుం డగువాఁడనపాయసుఖంబులం బొందుఁ బాపశీలుండు వివిధాపాయదుఃఖంబు లనుభవించు నీవు పరకాంతం దెచ్చి పాపంబున కొడిగట్టి చెడ నున్నాఁడ వని పలికి మఱియును. 14

సీ. చరణాగ్రమున నీభుజాదర్ప మడఁచిన
ధూర్జటివిలు లీలఁద్రుంచి వైచె
వాలపాశంబున వడి నిన్నుఁ గట్టిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నని నిన్నుఁ జెఱగొన్న యర్జునుఁ బొరిగొన్న
పరశురాముని నాజి భంగపఱిచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ
బదునాల్గువేవుర బారిసమరె

నమ్మహాధనుర్ధరున కెగ్గాచరించి
హరిహర బ్రహ్మశక్రాదు లైన నతని
భయదనిర్ఘాత సంఘాత పాతశాత
బాణఘాతహతులు గాక బ్రదుకఁ గలరె. 15

ఉ. ఉరవడి రాఘవాస్త్రతతు లుగ్రతరార్చుల మింట నంట నీ
కరములురంబునంగములుఁ గంఠములాస్యము లంఘ్రు లూరులున్
శిరములు మర్మముల్ బరులుఁజించుచు ద్రుంచుచు నుచ్చపాఱుచున్
మురియలు సేయుచున్ నిగుడమూఁడుజగంబులునాఁప నోపునే. 16

శా. శ్రేణీభూతము లై దిగంతముల విక్షేపించు సౌమిత్రిదో
త్థ్సాణాగ్రోజ్ఝితరుక్మపుంఖకషణో ద్భూతస్ఫులింగచ్ఛటా

క్షీణజ్వాలధురీణబాణములు వర్షింపంగ నీ వేల స
ప్రాణత్రాణశరీరులై నిలుతురే బ్రహ్మాదులున్ ముందటన్. 17

మ. తురగస్యందనమత్తవారణభట స్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁ గాల్చి సైనికసుహృత్పుత్రానుజశ్రేణి నె
త్తురు గ్రక్కం బడ గ్రుద్ది చంపి మఱి మృత్యుకూరతం బట్టి నీ
శిరముల్ ద్రుంపఁగ నేన చాలుదు జయశ్రీలబ్ధి వర్ధిల్లఁగన్. 18

క. సుగ్రీవాదులయెదుట ను
దగ్రగతిన్ నిన్నుఁ ద్రుంతు ననురఘుకుల వీ
రాగ్రణిప్రతిజ్ఞకతన ద
శగ్రీవుఁడ బ్రతికి తీవు చావక నాచేన్. 19

ఆ. అజునివరము నీకు నమరగంధర్వాసు
రాహియక్షరాక్షసాళిచేత
మడియ కుండఁ గాని మనుజవానరులచేఁ
గలనఁ జావకుండఁ గాదు వినుము. 20

క. ఘనుఁడగు రాముఁడు మనుజుం
డినజుఁడు వానరుఁడు గాన నయ్యిరువురచే
ననిఁ జావఁగల వాఁడవు
మనమున నామాటనమ్మి మతకరి వగచున్. 21

శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాపంబు లం
కౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యువున్ జనకకన్యన్ వేగ యొప్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీకీబుద్ధి గా కుండినన్. 22

క. సీతారాములకోప
స్ఫీతానలశిఖలు గలయఁ బేర్చుచు లంకా
భూతవ్రాతము భస్మీ
భూతముగాఁ జేయు ననుడుఁ బొడమినకిన్కన్. 23

మ. కుటిలభ్రూకుటిభీమఫాలదశక క్రూరాగ్రోరునాసాపుటో
ద్భటలంబోష్ఠహనుప్రకంపనపట ద్దంష్ట్రాతిఘోరాస్యుఁడై
పటుదృష్టిస్ఫుటవిస్ఫులింగములు పైపైఁ గ్రమ్మ నీకష్టమ
ర్కటునిం జంపుఁడు నా విభీషణుఁడు ధర్మం బొప్ప లంకేశుతోన్.

శా. ఈకోపంబున కగ్నియో వరుణుఁడో యీశానుఁడో వాయువో
నాకాధీశుఁడొ యక్షనాయకుఁడొ కీనాశుండొ కోణేశుఁడో
యీకీశాధముఁ డెంతవాఁ డరయ వీఁ డిట్లగ్గలే మాడినన్
నీకున్ వధ్యుఁడుగాఁడు సైఁపు మదిలో నీ వింక లంకేశ్వరా. 25

క. దూతకు వధకం బెఁ గశా
ఘాతము ముండనము సంగకర్తన మంకం
బాతతదండము లెందును
దూత యవధ్యుఁ డని చెప్పుదురు ధర్మవిదుల్. 26

వ. అని పల్కు రావణుండు విభీషణునిపల్కు లాదరించి 27

క. తరుచరునకు వాలము ప్రియ
కర మగుటను దీనితోఁకఁ గాలిచి నక్తం
చరు లందఱుఁ జూడఁగ నీ
పుర మంతయుఁ గలయఁ ద్రిప్పి పుచ్చుం డనినన్. 28

వ. ఉద్ధతి రణకర్కశు లగురక్కసు లక్కపీంద్రుం గవిసి. 29

క. హనుమనివాలము పెరుఁగఁగ
ఘనతరకార్పాసపట్టికాశ్రేణులఁ గ
న్కనిఁ జుట్టి నూనె నానిచి
యనలం బిడి మండ నూఁది రర్చులు నెగయన్. 30

ఉ. అప్పుడు శుష్కకాష్ఠనిచయజ్వలితాగ్నిసమప్రదీప్తుఁడై
యొప్పుచుఁ గీలజాలకలితోన్నతవాలము రాక్షసాళిపై
నిప్పులు రాలఁ ద్రిప్పుచును నిండినసందడి వాయఁ జూఁడుచుం
దప్పక పౌరు లోలిఁ దనుఁ దద్దయు విస్మయ మంది చూడఁగన్. 31

క. సోమూంచావృతవపువు
ద్రామాభ్రిముభంగి మెఱయుదతీక్ష్ణలోద్వృ
ద్భ్రమతరవాల మురుసా
దామనిగతిఁ దనరఁ దనరి తరుచరుఁడాత్మన్. 32

క. ఈకట్లుద్రెంచుకొనియీ
నాకారులఁ జంపునప్పుడు నానారక్షో
నీకంబులు గలవేగతిఁ
జేకొని కడలేని రణముసేయుదు నింకన్. 33

వ. కొంతతడవేమైనఁ జేయునిమ్మి సైరించెద మున్నరాత్రిగానం బడని యీలంకాపురంబునంగల యశేషవిషయంబులు దివాసమయంబున నీరక్కసులు ద్రిప్పికొని పోవం బోయి చూచెదంగాక యనుచుండ నంత లోఁ గొందఱు రాక్షసకింకరులాతనింగవిసి వీధులవెంటఁ ద్రిప్పుచుండ నీవృత్తాంతము భూపుత్రివిని మారుతాత్మజునకు శైత్యకారివగుమని యగ్నిహోత్రినిఁ బ్రార్థింప. 34

క. ఆయెడవాలాగ్రంబున
నాయతగతి మండుచున్న యయ్యనలము ప్రా
లేయముగతినతిశీతల
మైయుండుటకెరుదునొంది యనిలజుఁడాత్మన్. 35

క. రాముని సామర్థ్యమునన్
భూమిజ కారుణ్యమునన్ పొందుగఁబవనో
ద్దామసహాయంబునన్
నామేను దహింప వీయనలతీవ్రశిఖల్. 39

వ. అనుచు సంతసించి. 37

ఉ. మింటఁజటచ్ఛటధ్వనులు మేఘఘనధ్వనులై చెలంగనిం
టింటికిదాఁటి వాలమున నేచినచిచ్చు దగిల్చిదిక్కుల
న్నింటను విస్ఫులింగములు నిండఁగఁజల్లుచు మంటలాకసం
బంటఁగనుబ్బి యుగ్రత సమస్తగృహంబులు గాల్చెనయ్యెడన్. 38

# లఘుటిప్పణము.

గీతాంజలి.

పద్యసంఖ్య.

1. When the mind without fear............awake.
అనురవీంద్రుని గీతము దీనికిమూలము.

2. Every sound that I make .............Design.
అనునది దీనికి మూలము.

3, 4, 5, Life of my life ................ act.
అనునది వీని మూలము.

మహాప్రయత్నము.

పద్యసంఖ్య 2. వారిజాసనుఁడు = బ్రహ్మ; 4. నిశితకుద్దాలహతిఁ = వాడియైనగుద్దలులదెబ్బచే. గ్రోచ్చిరి = పల్లముచేసిరి. ఓటమి = భయము. 9. ఈశానువచనము. పూర్వము సగరుఁడు కైలాసమునఁ దపముచేసి శివుని సంతానమునకై యర్థించెను. ఈశ్వరుఁడు వానికి వైదర్భియం దఱువదివేవురు కొడుకులుగలిగి యతిదర్పితులై యేకకాలంబునఁగాల గోచరులగుదురని పలికెను. కొంతకాలమునకు వైదర్భిగర్భమున నొకఫలముపుట్టెను. సగరుఁడు దానిఁబాఱవైవ నాకాశవాణి సాహసముకూడదనియు, దానిబీజముల ఘృతఘటములఁ బెట్టింపుమనెను. పిదప నఱువదివేవురు ఘటములనుండి వెలువడిరి. 10. అసమంజసుఁడు, సగరుని రెండవభార్యయగు శైబ్యయందుజనించెను. 16. భారసహిష్ణుఁ = భారమునోర్వగల స్వభావము గలవానిని. 21. అమరాపగ = ఆకాశగంగ. 23. నీలకంఠుడు = శివుఁడు. 26. పూర్వమగస్త్యుఁడు సముద్రజలము నాపోశనము పట్టుటచే సముద్రము వట్టిపోయెను.

ప్రశ్నలు:— 1. సాగరము, భాగీరథి, పౌత్రులు; వీనివ్యుత్పత్త్యర్థములేమి; 2. "దర్పితులగు వారిశేర్మియధ్రువము." ఎట్లో తెల్పునది. 3. భగీరథుఁడు గంగను భూమికిఁదెచ్చిన విధమును దెలుపుఁడు.

శాపవిమోచనము.

కురుక్షేత్ర యుద్ధానంతరము వ్యాసునానతిచే ధర్మరాజు అశ్వమేధయాగదీక్షబూని అశ్వమువెంట నర్జునుబంపును. అర్జునుఁడు సింధుదేశమునుండి మణిపురమునకువచ్చును. ఉలూపి బభ్రువాహనుఁబ్రోత్సహించి తండ్రితో యుద్ధముచేయించును. అట్లుచేయించుటకు కారణమీకథయందుఁ గాననగును. 5. భుజంగోత్తమతనయ = ఉలూపి; నాగకన్యక; తీర్థయాత్రాపరుఁడైన యర్జునునిమోహించి నాగలోకమునకుఁ గొంపోయెను. అని = యుద్ధము. 9. సవ్యసాచి = అర్జునుఁడు. 10. పృథ్వీనాథ – ఓరాజా, వైశంపాయనుఁడు జనమేజయునిట్లుపిలుచును. 14. – మూఁడు + తునియలు – మూఁడుముక్కలు. 16. బెడిదపు + పీటులు; టుగాగమము. 23. ప్రాయోపవేశనము – ఆహారాదులవర్జించి మరణమునకై సిద్ధముగ కూర్చుం

డుట. 38. చిత్రాంగద: మణిపూరుప్రభుతనయ. అర్జునుఁడు వివాహమాడె నాతనివలన బభ్రువాహనుఁడుదయించెను. ఈమె చిరకాలము తండ్రియింటనుండెను. ఈమెపుత్రుఁడు మణిపురమునకు రాజాయెను. 39. నిష్కృతి - ప్రాయశ్చిత్తము.

ప్రశ్నలు:— 1. అర్జునుడు కొడుకుతో యుద్ధముచేయవలసివచ్చిన కారణమును దెలుపుము. 2. ఉలూపి యర్జునుశాపపరిహారమున కెట్లుతోడ్పడెను?

ఋణవిముక్తి.

అని - ఈ వీరబాహునకే అమ్మనను. ఇంకొకనికమ్మను అని. మునిపుత్రుఁడు. నక్షత్రకుఁడు. లేకివాఁడు - అప్రయోజకుఁడు. కరాళించు - నిందించు. సుకవాసి - కష్టపడక సుఖముగనుండువాఁడు. కింకరులు = పరిచారకులు. గుఱి - నిర్ణయము. పనిపంద - పనికి వెనుదీయువాఁడు. మామిడిక్రింది సోమరి - పండెప్పుడునోటఁబడునా అని కూర్చుండుసోమరి. జడ్డు - మాంద్యము. జట్టి. జేరము. తుంట + అరి మొండి + అరి స్వార్థమున 'అరి' ప్రత్యయము.

ప్రశ్నలు:— 1. ఈక్రిందిపదముల యర్థములేమి; వక్కసేయనివాడు; ఏనుపోతుపై వాన; గొలుసుతప్పినకోఁతి; మూపురుబ్బము; కనుసన్న; మామిడిక్రిందిసోమరి; సుకవాసి;

స్వార్థపదార్థులు.

1. విమలతరదివ్య గగనయానములమీఁదన్ - మిక్కిలి నిర్మలములగు విమానముల మీఁద. 2. అమృతాశులు - అమృతమును భుజించువారు, దేవతలు. శునాసీరుఁడు - ఇంద్రుఁడు. 3. సేమము. ప్ర. క్షేమము. రేఖ - తీరు; 4. అభిధానకుశలుఁడు - మాటనేర్పరి. 5. ననిచిన - మొగ్గలుతొడిగిన. 9. భీమక్షోణీజతనూజ - భీమరాజపుత్రి, దమయంతి. 10. ఈవి = దానమిచ్చుట. 14. బేహారము - వ్యవహారము. 15 బర్హిర్ముఖులు - దేవతలు. 18 కామన - కోరిక 23. విస్మృతి - మఱపు.

ప్రశ్నలు:— 1. దాత లక్షణములేమి? ఇంద్రుఁడు, రాజు, దేవతలు, వీనిపర్యాయపదములను దెలుపుము.

పతివ్రత.

1. అప్పుడు - ఆయన్న దమ్ముల తండ్రిమరణించిన పిదప 4. పాయపడితిమి - తొలఁగితిమి. 7. కూరగాయలు: ద్వంద్వ సమాసము; గవర్ణమాదేశము. 8. గడన - సంపాదన 11. ఓజ = స్వభావము; వాదు - కలహము. 14. సహజన్ములు - తోడఁబుట్టినవారు. 17. సౌజన్యధనుఁడు - మంచితనమే ధనముగాఁగలవాఁడు 22. ఊఁత - ఆధారము. 23. వామనుఁడు బలితో మాట్లాడుట (భాగవతములో) చూడుము. 29. కౌశికుఁడను విప్రునిభార్య; అనసూయ; సావిత్రి; అరుంధతి.

ఏకక్రియా ద్వ్యర్థకరీ.

2. చక్రి - చక్రముగలవాఁడు-కృష్ణుఁడు. 3. మహీసురులు - బ్రాహ్మణులు 5. అ + మణి - అమ్మణి. త్రికములపైసంధి. 15. ప్రాకృతపురుషుఁడు - పామరుఁడు 16. నోరిరి. షష్ఠీవిభక్తిపై వకారాదేశము. 17. డకారమెన్ని పర్యాయములున్నదో చూడుఁడు. అట్లుండుటకుఁ గారణమేమి? 22. తామసులు - దుష్టులు 33. అంత్యప్రాసను గమనింపుఁడు.

ప్రశ్నలు:— 1. దుర్గమము, దుర్గ, దుర్గము. వీనియర్థములేమి? అమరులు, కరి, చక్రి. వీనివ్యుత్పత్తులేమి? 2. కృష్ణునికి నిందగలిగినవిధమును, దానినతఁడు పోగొట్టుకొన్న విధమును వ్రాయుఁడు.

దుస్సహవియోగము.

1. వసుధాధిపుఁడు. రాజు. (రాముఁడు) 5. జెట్టిదము - నిష్ఠురము. 6. కళవళము-తొట్రుపాటు. 16 ఏడు + కడ - ఏడుగడ - రక్షకము.

ప్రశ్నలు:... సీతలక్ష్మణనితోఁబల్కిన మాటలను మీసొంత మాటలలో వ్రాయుఁడు.

సుభాషితములు:— నీతిశతకములోని.

నీతిశతకము పదిపద్ధతుల విభజింపఁబడినది. ఇందలి మొకటి నాలుగు పద్యములను ఏనుఁగు లక్ష్మణకవిరచించినవి. అవిక్రమముగ మూర్ఖపద్ధతి, విద్వత్పద్ధతి, మానశౌర్యపద్ధతి, అర్థపద్ధతిలోనివి, 1. మానికము - ప్ర. మాణిక్యము; 2. మర్త్యుఁడు - మనుష్యుఁడు. 3. సింగపు + కొదమ. పువర్ణాదేశము. నకారాగమము. 4. కులీనుఁడు-మంచికులమునఁబుట్టినవాఁడు. 5, 6, 7 పద్యములు క్రమముగ ఎలకూచి బాలసరస్వతిరచించిన దుర్జన, సుజన, పరోపకార పద్ధతులనుండి యుద్ధృతములు. జటప్రోలుసంస్థానాధీశుఁడగుసురభిమల్లభూపాలునకాగ్రంథమంకితమగుటచే ప్రతిపద్యమునను, సురభిమల్లా, నీతివాచస్పతీ అని మకుటము చేరినది, 5. వివర్జ్యుఁడు- వదలిపెట్టఁదగినవాఁడు. ఫణి. వ్యు. ఫణము (పడగ) కలది పాము. 7. జలజాతములు - కమలములు. 8, 9, 10 పద్యములు పుష్పగిరితిమ్మనవ్రాసిన ధైర్య, దైవ, కర్మపద్ధతులనుండి తీయఁబడినవి. ఇతనిగ్రంథము సమగ్రముగ నాంధ్రలోకమునకు లభింపలేదు. 9. లేవడి - దరిద్రము.

మధుకలశము.

ఫిట్జిగెరాల్డ్ పార్సీ కావ్యమగు ఉమర్ ఖయ్యామ్ రుబాయీయాత్ ను 1859 సంవత్సరమున 75 పద్యములలోఁ బ్రకటించెను. తర్వాత దీనినిదిద్ది మూఁడుపర్యాయములు మరల ప్రచురించెను.

ఉమర్ ఖయ్యామ్ 11 వ శతాబ్దాంతమందు నివసించి 1123 లో మరణించెను. నైషాపూర్ (పర్షియా) ఇతనిజన్మస్థలము. ఈతని రుబాయీయాత్ లో ఒక్కగీతమున కొక్కభావ ముండును.

1. ఈప్రపంచమను నొక ఎడారిసత్రమున కనేకులువత్తురు. నిలుతురు, పోదురు. సుల్తానులు; ప్రభువులు. 2. ఈమధువును దాగుము. అన్నియు దీనితోఁదీరును. 'రేపు' లెన్నో కాలమయమైన అబ్దరాశిలో కలిసిపోయెను. 3. గ్రిష్మదూతి: గ్రీష్మమనెడిదూతి, కులికెడుక కులుకును. 3. మధువెండును – జీవితమాధుర్యము గతించును. 5. నీవు– ఈవృద్ధుఁ ఉమర్ ఖయ్యామును. ఉదయము విచ్చినపూలు సాయంకాలమురాలును. 6. నాపరిశ్రమమంతయు వ్యర్థమైనది. 7. జలమువలె ఎక్కడినుండియో వచ్చితిని, ఎక్కడికిపోవుదునో ఎఱుఁగను. 10. ఈప్రపంచమొక్క చదరంగపాళి; దీనియందును గళ్లు, సారెలుగలవు.

(ఇవిక్రమముగ 16, 20 22, 23, 26, 27, 29 39, 47, 49.) ఫిట్స్‌గెరాల్డ్ పద్యముల కనువాదములు.)

ప్రశ్న:— ఉమర్ ఖయ్యామ్ భావములను చక్కఁగఁదెలుపుఁడు.

ధర్మోపదేశము.

2. నిజాపత్యమ్ము – తనసంతానము. 3. జాల్ములు – క్రూరులు; పామరులు; 4. సైంధవకృత్యము – గుఱ్ఱపుపని, 7. మునీంద్రుఁడు – బుద్ధుఁడు. 12. వేఁకి జ్వరము. 15. సేద – శ్రమము.

ప్రశ్న:— బుద్ధుఁడు నందరునకుఁజేసిన యుపదేశమునుదెలుపుము.

భారతవీరుఁడు.

1. దండిమగఁడు – శూరుఁడు. 2. ధనంజయుఁడు = అర్జునుఁడు. 5. ధనుష్టంకారము – వింటినారిధ్వని. 9. పార్థనామము – అర్జునుపేరు.

అమర్షము.

1. సౌధము – మేడ 4. మచ్చరము. ప్ర. మత్సరము. 5. అహంకృతి – గర్వము. 7. కలహాశనుఁడు – నారదుఁడు. 16. లతాంతము = పుష్పము.

ప్రశ్న:— ఈక్రిందివాని యర్థములేమి?

1. మిన్నంది; చెవియొగ్గివినుట, మొగమోట; ముళ్లమాటలు; శరబంబుదచలచిత్తుఁలు; కన్నులఁగప్పికొనుట, తలలెత్తుట; పూసలలోదారము; మేరదప్పుట; 2. సత్యభామ ప్రేటువడినయురగాంగనవలె రోషించి యేమాడినో తెలుపునది.

ప్రణయార్ద్రగీతికలు:—

మదశుక్రకణములు – నాకన్నీటి బిందువులు – సడి – చప్పుడు – కోమల పుష్పములు – సన్నితములైనపూలు.

